  

శ్రీహయగ్రీవాయ నమః.

శ్రీమతే రామానుజాయ నమః.

# శ్రీపాంచరాత్రాగమ దివ్యశాస్త్రవిషయప్రదర్శని

యను

# తాంబూలదుర్వాద ఖండనము.




ఇయ్యది

శ్రీమాన్, శ్రీపతి సుదర్శనాచార్య

ప్రణీతంబై,

ఉభయవేదాంతప్రవర్తకులైన,

శ్రీమచ్ఛ్రీరంగం, నల్లాన్ చక్రవర్తుల శ్రీనివాసరఘునాథాచార్యులు

అయ్యవార్లంగారిచే

పరిష్కరింపంబడి,



బెజవాడ, ఆంధ్రగ్రంథాలయ ముద్రాక్షరశాలయందు

క. కోదండరామయ్యగారిచే ముద్రింపబడియె.

1934

శ్రీపాంచరాత్రాగమ విషయ ప్రదర్శినియందలి

# ప్రకరణ విషయసూచిక.







శ్రీరస్తు.





# శ్రీపాంచరాత్రాగమదివ్యశాస్త్రవిషయప్రదర్శని

అను

# తాంబూలదుర్వాదఖండనము.



శ్లో॥ పాంచరాత్రం మహద్దివ్యం శాస్త్రం శ్రుతివిభావనం,
విశేషేణాధిగంతవ్యం గీతం భగవతా స్వయమ్.

—భారద్వాజ సంహితే.

శ్లో॥ ఆగమా స్త్రివిధాః ప్రోక్తా స్సాత్త్వరాజసతామసాః,
సాత్త్వికా మోక్షఫలదా రాజసా స్స్వర్గదా స్స్మృతాః,
తత్రైవ తామసా దేవి నిరయప్రాప్తిహేతవః.

—స్కాందే.

అను ప్రమాణములచే సాత్వతాగమ మను శ్రీపాంచరాత్రాగమ భగవద్దివ్యశాస్త్రము మోక్షఫలప్రదం బైనదిగా సర్వత్ర తెలియదగియున్నది.

శ్రీ శ్రీ శ్రీ



శ్రీహయగ్రీవాయ నమః.

# ఉపోద్ఘాతపీఠిక.

ఆస్తికమహాశయులారా!

శ్లో॥ ఆహారనిద్రాభయమైథునాని సామాన్యమేతత్పశుభిర్నరాణాం,
జ్ఞానం నరాణామధికో విశేషో జ్ఞానేన హీనాః పశుభిస్సమానాః.

అనునటుల ఆహారము - నిద్ర - భయము - మైథునము అనునవి పశుపక్షిమృగాదులకును మనుజులకును సమానమే. అయినను మనుజులకు జ్ఞానమును సర్వేశ్వరుండు ప్రసాదించి ధర్మార్థకామమోక్షచతుర్విధపురుషార్థప్రతిపాదకంబు లగు శ్రుతిస్మృతిపురాణేతిహాసములను చతుర్ముఖబ్రహ్మద్వారా లోకంబుల వ్యాపింపజేయ మహాత్ములు కొందరు శాస్త్రావలోకనం బొనర్చి పెద్దలచే సుశిక్షితులై 'జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్' అనునటుల భగవదభిమానపాత్రులై నిత్యముక్తపరమప్రాప్యం బగు పరమవ్యోమనిలయంబున పరమానందభరితులై యుందురు. మఱికొందరు శాస్త్రావలోకన మొనర్చి క్షణభంగురాల్పఫలంబుల గోరి ప్రవర్తింతురు. మఱికొందరు కేవలమధర్మపరాయణులై వివేకశూన్యులై వర్తింతురు. కలిదోషంబుచే నీకాలంబున జ్ఞాను లరుదుగ నుందురను విషయం బెల్లరకిని దెలిసినదియే.

శ్లో॥ కలౌ జగత్పతిం విష్ణుం సర్వస్రష్టారమీశ్వరం,
నార్చయిష్యంతి మైత్రేయ పాషండోపహతా జనాః.

అనునటుల విష్ణుదూషకులై భగవదారాధనంబు జేయక,

శ్లో॥ యో మోహాదథవాఽలస్యాదకృత్వా దేవతార్చనం,
భుంక్తే స యాతి నరకం శూకరేష్వభిజాయతే.

అను పరాశరమాధవీయ దేవపూజాప్రకరణస్థ ప్రమాణంబుల విచారింపక ఆరాధనవిధుల నెఱుంగక భగవదారాధనపరులైన శ్రీపాంచరాత్రస్వాములకు మతత్రయాధికారము లేదని సిద్ధాంతీకరించిన సత్క్షత్రియయాజకశ్రేష్ఠులైన శిష్ట్లా వెంకటశాస్త్రిగారి దుర్వాదనిర్వాదమకుటమ్ముగా, పూర్వాచార్యసాంప్రదాయానుసారముచే శ్రీపాంచరాత్రవిషయమై బహుధర్మశాస్త్రప్రమాణప్రదర్శకముగా విమర్శించెద నను విజ్ఞప్తి.

ఇట్లు సుజనానుమోది,

శ్రీపతి సుదర్శనాచార్యులు,

చేతవోలు,

గుడివాడపోష్టు, కృష్ణాజిల్లా.

శ్రీరస్తు.

# శ్రీపాంచరాత్రాగమదివ్యశాస్త్రవిషయప్రదర్శని

అను

# తాంబూలదుర్వాదఖండనమ్.

## ప్రథమ ప్రకరణము.

### వేదశాస్త్రాది విషయము.

శ్రుతిః-"యో బ్రహ్మాణం విదధాతి పూర్వం యోవై వేదాంశ్చ ప్రహిణోతి తస్మాత్" అను ప్రమాణముచేతను "బ్రహ్మణా కేశవాచ్ఛ్రుతం" అనుటచేతను.

కూర్మపురాణే:—

"శ్లో॥ ప్రవృత్తి స్సర్వశాస్త్రాణాం పురాణస్యాభవ త్తతః,
కలినా గ్రహణం దృష్ట్వా పురాణస్య తథా విభుః
వ్యాసరూపీ తథా బ్రహ్మ సంగ్రహార్థం యుగేయుగే."

అను ప్రమాణములచే చతుర్వేదములును, పురాణపురుషుడైన శ్రీమన్నారాయణమూర్తిచే కల్పాదియందే బ్రహ్మకుపదేశింపబడినట్లు తెలియుచున్నది. అట్టి 'ఋగ్యజుస్సామాథర్వణాఖ్యాశ్చత్వారో వేదాః' అనుచతుర్వేదములును, 'ఆయుర్వేద నాట్యవేద గాంధర్వవేద ధనుర్వేదాఖ్యాశ్చత్వార ఉపవేదాః' అను నుపవేదములును, 'జ్యోతిషం, వ్యాకరణం, శిక్షా, కల్పః, ఛందః, నిరుక్తం - ఏతాని షడ్వేదాంగాని' అను వేదాంగములును, "ఋగ్వేదోపనిషత్, యజుర్వేదోపనిషత్, సామవేదోపనిషత్, తైత్తిరీయం, బృహదారణ్యకం, శారీరకం, లైంగ్యం, నారసింహం, శతపథబ్రాహ్మణం, గారుడం, ఛాందోగ్యం, కఠవల్లి, ముండకం, ముద్గలం, బ్రహ్మబిందుః, తాపనీయం, జ్ఞానవర్గం, యాజ్ఞవల్క్యం, మైత్రావరుణం, కాలాగ్నిరుద్రం, జాబా

లం, సుబాలం, పారమాత్మ్యం, చిద్గుణాలయం, మంత్రోపనిషత్, అథర్వశిరో మహోపనిషత్, శ్వానోపనిషత్, నారాయణోపనిషత్, ఏతద్ద్వాత్రింశదుపనిషదః” అను నీముప్పదిరెండు ఉపనిషత్తులును, “సూత్రాణి:– బోధాయన, మాంపస్తంబః, సత్యాషాఢం, దాహ్యాయణం అగస్త్యం, శాకల్యం, ఆశ్వలాయనీయం, శాంభవీయం, కాత్యాయనం, ఇతి నవపూర్వసూత్రాణి” అను నీపూర్వనవసూత్రములును, “వైఖానసం, శౌనకీయ్యం, భారద్వాజం, అగ్నివైశ్యం, జైమినీయం, మాధులం, మాధ్యందినం, కౌండిన్యం, కౌషీతకం, ఇతినవాపరసూత్రాణి, అష్టాదశసంఖ్యాకా శ్శారీరా స్సంస్కారా ఇత్యేతాన్యష్టాదశసూత్రాణి,” ఇట్లనేకశాఖోపశాఖలుగా నున్న చతుర్వేదసారమంతయును.

మనుస్మృతౌ:—

శ్లో॥ ఇదం శాస్త్రం కృత్వాఽసౌ మామేవ స్వయ మాదితః,
విధివ ద్గ్రాహయామాస మరీచ్యాదీం స్త్వహం మునీన్.

అనుప్రమాణముచే బ్రహ్మమన్వాదిమహాఋషుల కుపదేశింపబడెను. అట్లు ధర్మప్రణేత లగు మహాఋషులు

పరాశరే:—

శ్లో॥ తేషా మన్వంగిరోవ్యాస గౌతమాత్ర్యశనోయమాః,
వశిష్ఠదక్షసంవర్త శాతాతపపరాశరాః,
విష్ణ్వాపస్తంభహారీతా శ్శంఖా కాత్యాయనో భృగుః,
ప్రచేతో నారదో యోగీ బోధాయనపితామహా,
సుమతిః కశ్యపో బభ్రుః పైఠీనో వ్యాఘ్రు ఏవచ,
సత్యవ్రతో భరద్వాజో గార్గ్యః కార్ష్ణాజిన స్తథా,
జాబాలి ర్జమదగ్నిశ్చ లోకాక్షి ర్బ్రహ్మసంభవః,
ఇతి ధర్మప్రణేతారః షట్త్రింశ దృషయ స్తథా.

ఇట్టి ధర్మప్రణేతలగు మహాఋషులచే ప్రోక్తము లయిన స్మృతీతిహాసధర్మశాస్త్రముల వివరింతము.

శ్లో॥ వాశిష్ఠంచైవ హారీతం వ్యాసం పారాశరం తథా,
భారద్వాజం కాశ్యపంచ సాత్వికా ముక్తిదాయకాః.

శ్లో॥ మానవం యాజ్ఞవల్క్యంచ ఆత్రేయం దాక్ష్య మేవచ,
కాత్యాయనం వైష్ణవంచ రాజసా స్స్వర్గదాయినః.
గౌతమం బార్హస్పత్యంచ సాంవర్తంచ యమస్మృతిః,
శాంఖం చౌశనసం దేవి తామసా నిరయప్రదాః.

ఏతా హ్యష్టాదశ స్మృతయః శాతాతపం, శాండిల్యం, లిఖితం, ఆంగీరసం, పైఠీనసం, బృహద్ధారీతం, వృద్ధమనుః, జాబాలం, వృద్ధబార్హస్పత్యం, వృద్ధవాశిష్ఠం, సనకసం, దత్తాత్రేయం, క్రతుః, దాల్భ్యం, ప్రాజాపత్యం, బోధాయనం, జాతుకర్ణ్యం, లోకాక్షీ, ఏతా హ్యష్టాదశోపస్మృతయః.

శ్లో॥ పాద్మం పద్మోద్భవం చైవ పుష్కరం వైభవం తథా,
నలకూబరం నారదీయం సనత్కుమారంతు సాత్వతాం,
వాశిష్ఠం జనకంచైవ ఐంద్రం భువనమోహనం,
భవిష్యం తిలకంచైవ, విజయం పారమేశ్వరం,
తత స్సద్వాక్యం పరమం హ్యష్టాదశాత్మకాగమాః.

అను నీ అష్టాదశ ఆగమములును,

శ్లో॥ వైష్ణవం నారదీయంచ తథా భాగవతం శుభం,
గారుడంచ తథా పాద్మం వారుణం శుభదర్శనే,
షడేతాని పురాణాని సాత్వికాని మతాని వై.

అను నీసాత్వికపురాణములును,

శ్లో॥ బ్రహ్మాండం బ్రహ్మకైవర్తం మార్కండేయం తథైవచ
భవిష్య ద్వామనం బ్రాహ్మం రాజసాని నిబోధ షట్.

అను రాజసపురాణములును,

శ్లో॥ మాత్స్యం కౌర్మ్యం తథా లైంగ్యం శైవం స్కాందం తథైవచ,
ఆగ్నేయం చ షడేతాని తామసా నిరయప్రదాః.

అను తామసపురాణములును, 'ఏతాన్యష్టాదశ పురాణాని' అను అష్టాదశపురాణములును,

శ్లో॥ వాయువ్యం భార్గవం సౌమ్యం బ్రాహ్మం కౌశికకం తథా,
పారాశర్యం నారదీయం నారసింహంతు కాపిలం,
వాశిష్ఠం శివధర్మంచ మారీచం మానవం తథా,
స్కాందం దౌర్వాస మాదిత్యం వారుణం శాంబరం తథా.

'ఏతాన్యష్టాదశోపపురాణాని' అను ఉపపురాణములును, "పాతంజలం, కాపిలం, సాంఖ్యం, జైమినిసూత్రం, వైశేషికం, గౌతమ సూత్రం, వ్యాససూత్రం, ఏతాని షడ్దర్శనాని" అనుషడ్దర్శనములును శ్రీరామాయణాదయ ఇతిహాసాః, ఈమొదలయిన ఇతిహాసములును, 'భారతం, భారద్వాజసంహితా, పహగేంద్రసంహితా, అగస్త్య సంహితా, పరాశరసంహితా, వాశిష్ఠసంహితా, ఇత్యాదయ స్సంహితాః' అను సంహితలు, శ్రుతులు, స్మృతులు, ఆగమములు, షడ్దర్శనములు, పురాణములు మొదలగు శ్రుతిస్మృతులు.

శ్రీ భగవా నువాచః—

శ్లో॥ శ్రుతి స్స్మృతి ర్మమైవాజ్ఞా యస్తా ముల్లంఘ్య వర్తతే,
ఆజ్ఞాచ్ఛేదీ మమద్రోహీ మద్భక్తోపి న వైష్ణవః.

అను ప్రమాణముచే భగవదాజ్ఞారూపములగు శ్రుతిస్మృతీతిహాసపురాణాగమాదులు సర్వవర్ణములవారికిని ఒప్పిదములైన ధర్మములేగదా! అట్టి వేదరూపములగు ధర్మశాస్త్రప్రమాణములచే నత్తత్రియాజక శ్రేష్ఠులైన శాస్త్రిగారి తాంబూలదుర్వాదమును నిర్వాదమగునట్లుగా ఖండన జేయుటకుంగి దేవతార్చనవృత్తిచే గల్గుదేవలకత్వదోషము శ్రీపాంచరాత్రవిషయము కాదని నిరూపణప్రమాణములను ప్రదర్శించెదము.

శ్రీ పాంచరాత్రాగమ దివ్యశాస్త్ర విషయప్రదర్శని
యందు
ప్రథమ ప్రకరణము వేదశాస్త్రవిషయము
సంపూర్ణము.

---

శ్రీరస్తు.

# శ్రీపాంచరాత్రాగమదివ్యశాస్త్రవిషయప్రదర్శని

అను

# తాంబూలదుర్వాదఖండనము.

## ద్వితీయప్రకరణము.

### దేవలకత్వనిరూపణ తాంబూలదుర్వాదఖండనము.

ఆస్తిక మహాశయులారా, తాంబూలదుర్వాద మేమనగా,

శ్లో॥ దేవార్చనరతో విప్రో విత్తార్థీ వత్సరత్రయం,
స వై దేవలకో నామ హవ్యకవ్యవిగర్హితః

అనియును—

శ్లో॥ దేవార్చకస్య యో భుంక్తే తథా గణికవేశ్మని,
ఉభౌ తౌ పాపినౌ జ్ఞేయౌ ప్రాయశ్చిత్త మథార్హతః.

అనియును—

శ్లో॥ స్పృష్ట్వా దేవలకం చైవ స వాసాజల మావిశేత్.

ఇత్యాది ప్రమాణములచే సంప్రదాయ సదాచారసద్ధర్మంబుల విచారింపక శ్రీపాంచరాత్ర భగవదర్చకులకు దేవలకత్వము కలదనియు, దేవపూజామాత్రోపజీవు లనియు, అట్టి దేవలకత్వాది వృత్తిదోషు లెవరైనదియు తెలియక ప్రసంగించునట్టి నక్షత్రయాజక శ్రేష్ఠులైన శాస్త్రిగారి దుర్వాదవిషయమై దేవలకత్వనిర్ణయవిమర్శకు గడంగితిమి.

దేవలకత్వలక్షణవిమర్శన మేమనగా:—

శ్లో॥ కర్మదేవలకాః కేచిత్ కల్పదేవలకాః పరే,
శుద్ధదేవలకాః కేచి త్త్రిధా దేవలకాస్స్మృతాః.

—సంకర్షణసంహితే: ప్రపన్నధర్మసారసముచ్చయే.

అను ప్రిమాణముచే - కర్మదేవలకులు, కల్పదేవలకులు శుద్ధదేవలకులు, అని దేవలకులు మూడువిధము లనియు, అందు కర్మదేవలకు లనగా:—

శ్లో॥ అర్థార్థీ కాలనిర్దేశీ యో దేవం పూజయే త్సదా,
కర్మదేవలకో నామ సర్వకర్మబహిష్కృతః.
—ధర్మసారసముచ్చయే.

శ్లో॥ వృత్త్యర్థం యాజన స్సర్వే దీక్షాహీనాశ్చ కేవలం,
కర్మదేవలకా యే తే స్మృతా వ్యాత్రి పురా మునే,
తాంశ్చ సంవత్సరా దూర్ధ్వం న స్పృశే న్నచ సంవిశేత్.
—యామునాగమే.

ఇత్యాది ప్రిమాణములచే దీక్షావిహీనులై ద్రవ్యాపేక్షచే కాలనిర్దేశముతో నర్చించువారలు కర్మదేవలకు లనబడుదురు.

కల్పదేవలకు లనగా:—

శ్లో॥ పాంచరాత్రివిధానజ్ఞో దీక్షావిరహితోఽర్చకః,
చతుర్వేదాధికారోపి కల్పదేవలక స్స్మృతః.
—ధర్మసారసముచ్చయే.

శ్లో॥ యే కల్పోక్తం ప్రికుర్వంతి దీక్షాహీనా ద్విజాదయః,
వృత్త్యర్థం వా యశోర్థంవా కల్పదేవలకా స్తు తే,
కల్పదేవలకాః కేచి త్కర్మదేవలకా అపి,
అథ త్రివర్షా దూర్ధ్వ మయోగ్యా దేవకర్మణి.
—యామునాగమే.

అను ప్రిమాణములచే వృత్త్యర్థముగాగాని, యశోర్థముగాగాని, పాంచరాత్రివిధిని దెలిసికొనియు దీక్షారహితు డయి యర్చించువాడు కల్పదేవలకు డనబడును. ఈ రెండుతరగతులవారును మూడుసంవత్సరములకన్న మించినయెడల దేవకర్మకు అయోగ్యు లగుదురు.

శుద్ధదేవలకు లనగా:—

శ్లో॥ ఆగమోక్తవిధానజ్ఞో రుద్రకాళ్యుపజీవకః,
శుద్ధదేవలకో నామ సర్వకర్మబహిష్కృతః.
—ధర్మసారసముచ్చయే తాంత్రికమీమాంసాయాం.

శ్లో॥ భవే ద్దేవలకో యో వై రుద్రకాళ్యుపజీవకః,
—యామునాగమే.

శ్లో॥ అదీక్షితేన విప్రేణ యేన కేన విధానతః,
వృత్త్యర్థం యత్కృతం కర్మ తజ్జఘన్య ముదాహృతం,
హారే రన్యత్ర యత్కుర్యా ద్దేవతాంతరపూజనం,
తత్ప్రసాదోపజీవీ చ స వై దేవలకో భవేత్.
—ధర్మసారే.

అనియును—

శ్లో॥ పరార్థం యజనం యస్తు దీక్షాసంస్కారవర్జితః,
చతుర్వేదధరో విప్ర స్స వై దేవలకో భవేత్.

అనియును—

శ్లో॥ దేవద్రవ్యాపహారార్థం దీక్షారహితపూజకః,
స వై దేవలకో నామ సర్వకర్మబహిష్కృతః.
—మార్కండేయసంహితే.

అనియును—

శ్లో॥ దీక్షాసంస్కారరహితో మద్బింబం పూజయే న్నరః,
స వై దేవలకో నామ సర్వకర్మబహిష్కృతః.
—భారద్వాజసంహితే.

అనియును—

శ్లో॥ దీక్షావిధివిహీనశ్చ విత్తార్థీ దేవపూజకః,
దేవకోశోపజీవీచ సవై దేవలకో భవేత్.
—జయాఖ్యసంహితే.

అనియును—

శ్లో॥ భారద్వాజా నామ యే తు విప్రా శివపరాయణాః,
తేచ దేవలకా జ్ఞేయా స్సర్వకర్మసు గర్హితాః.
—హారీతస్మృతౌ.

అనియును—

శ్లో॥ రుద్రాణీ భైరవవిఘ్నేశౌ భద్రకాళీంచ మాతృకామ్,
యోఽర్చయేద్భక్తిమార్గేణ విప్ర స్సవై దేవలక స్స్మృతః,
గణేశం భైరవం భీమం దుర్గాదీ రుగ్రదేవతాః,
యోఽర్చకో భక్తిమార్గేణ విప్ర స్సవై దేవలకో భవేత్.
—ధర్మసారే.

శ్లో॥ దేవార్చనరతో విప్రో విత్తార్థీ వత్సరత్రయం,
సతు దేవలకో నామ సర్వకర్మబహిష్కృతః.
—పరాశరస్మృతౌ.

అనియును—

శ్లో॥ న పాంచరాత్రవిధివాన్ న వైఖానససూత్రవాన్,
న శైవదీక్షితో విప్రః అర్థార్థీ వత్సరత్రయమ్,
గ్రామగేవార్చనపర స్సవై దేవలక స్స్మృతః.
—ధర్మసారే.

అనియును—

శ్లో॥ చండికాయాస్తు దుర్గాయా జ్యేష్ఠాయా భైరవస్యచ
రుద్రస్య పూజకా యే తు తేవై దేవలకా స్స్మృతాః.
—విష్ణుధర్మోత్తరఖండే.

ఇత్యాది బహుప్రమాణము లన్నియు, పాంచరాత్రదీక్షాయుక్తులై తత్తీర్థప్రసాదోప జీవకులుగా దేవతాంతరభజన మొంతమాత్రమును జేయక, స్వార్థపరార్థయజనాధికారనిష్ఠులగు భగవదర్చకులకు, దేవలకత్వదోషంబు లేదనిన్ని; పైప్రమాణనిరూపణముచే అదీక్షాపరులకే దేవలకత్వదోష మున్నదని విద్వజ్జనమహాశయు లందఱు బాగుగ దెలిసికొందురుగాక. మరియు శాస్త్రిగారు మతాంతరులుగాన పరమవైదికసదాచారధర్మం బగుదీక్షాసంస్కారవిధి యననేమో తెలియకపోవచ్చును. ఇందులకు దీక్షావిషయమై యెఱింగించెదను.

## శ్రీ పాంచరాత్రాగమ దివ్యశాస్త్ర విషయప్రదర్శని
## యందు
## ద్వితీయ ప్రకరణము దేవలకత్వనిరూపణ
## దుర్వాదఖండనము



శ్రీరస్తు.

# శ్రీపాంచరాత్రాగమదివ్యశాస్త్రవిషయప్రదర్శిని

అను

# తాంబూలదుర్వాదఖండనమ్.



## తృతీయప్రకరణము.



### చక్రాంకనదీక్షావిధి.

శ్లో॥ తప్తేనైవాంకనం కుర్యాద్బ్రాహ్మణస్య విధానతః,
శ్రౌతస్మార్తాదిసిద్ధ్యర్థం మంత్రసిద్ధ్యై తథైవచ
హరేః పూజావిధానార్థం చక్రం ధార్యం విధానతః
తస్మాత్తు విధినా చక్రం విప్రైర్ధార్యం శుభాననే.

—ప్రపన్నధర్మసారసముచ్చయే-పాద్మోత్తరఖండే.

అనియును—

శ్లో॥ ధృతోర్ధ్వపుండ్రః పరమేశితారం
నారాయణం పూజయతి స్మ భక్త్యా
అర్ఘ్యాదిభిః పౌరుషసూక్తమంత్రైః
స్సంప్రాప్నుయాద్విష్ణుపదం మహాత్మా.

—కాఠకశ్రుతి.

'అర్చనాదౌ యజ్ఞమూర్తే ఊర్ధ్వపుండ్రం' ఇత్యారభ్య 'కులం తారయతే సప్త స గచ్ఛేద్వైష్ణవం పదం' ఇత్యంతాదిసచ్చరిత్రరక్షాగ్రంథస్థప్రమాణైః.

—భల్లశాఖాయాం.

దేవా సో ఏన విధృతేన బాహునా సుదర్శనేన ప్రాచాం స్వర్గ మాయాంతి, నామనవో లోకవిసృష్టా తన్వంతి, బ్రాహ్మణ

స్తద్వయంతి, సర్వాన్వై దేవతానాం, సర్వాన్వై విప్రాణాం, సర్వాన్వై క్షత్రియాణాం, సర్వాన్వై వైశ్యానాం, సర్వాన్వై శూద్రాణాం ఇత్యగ్నినావై హోతా ప్తతప్తం చక్రం ద్విభుజే ధ్దార్యం; అథోర్ధ్వపుండ్ర మాలిఖేత్; తస్మా ద్ద్విరేఖం భవతి; పునరాగమనం న; బ్రహ్మణ స్సాయుజ్య స్సలోకతా మాప్నోతి.

—కాణ్వవేదే-శతపథబ్రాహ్మణే.

పవిత్ర మిత్యగ్నిః, అగ్నిర్వై సహస్రారః, సహస్రారో నేమిః, నేమినా తప్తతనుః, బ్రహ్మణ స్సాయుజ్యగ్మ్ సలోకతా మాప్నోతి.

—సామవేదమైత్రాయణశాఖాయాం.

యేన దేవాః పవిత్రేణ ఆత్మానం పునతే సదా, తేన సహస్రధారేణ పావమాన్యః పునంతు మాం, ప్రాజాపత్యం పవిత్రం శతోద్యామగ్ం హిరణ్మయం తేన బ్రహ్మవిదో వయం, పూతం బ్రహ్మపునీమహే, ఇంద్ర స్సునీతి స్సహ మా పునాతు.

—యజుషి.

పరితే విష్ణో రబ్జచక్రే పవిత్రే జన్మాంభోధిం తర్తవే చర్షణీంద్రాః మూలే బాహ్వో ర్దధతేన్యే పురాణా లింగాన్యంగే తావకా న్యర్పయంతి.

—ఋచి.

పవిత్రం తే వితతం బ్రహ్మణస్పతే ప్రభు ర్గాత్రాణి పర్యేషి విశ్వతః, అతప్తతనూ ర్న తదామో అశ్నుతే శృతాసఇద్వహంత స్తత్సమాశత.

—యజుషిచ సామ్నిచ.

చక్రం బిభర్తి వపుషాభితప్తం బలం దేవానా మమితస్య విష్ణోః, స ఏతి నాకం దురితా విధూయ, ప్రయాంతి యద్వ్యేతయో వీతరాగాః, ఏభి ర్వయ మురుక్రమస్య చిహ్నై రంకితా లోకే సుభగా భవామ, తద్విష్ణోః పరమం పదం యే గచ్ఛంతి లాంఛితాః చక్రమాదాయాగ్నౌ ప్రతాప్య బ్రాహ్మణ స్సోత్తరబాహౌ ధారయేత్.

—అథర్వణవేదే.

విచిక్షేప సుషణం భిద్యమానం సుధ్యే బాహుమదధ త్సుదర్శనం, విష్ణోరిదం భూరిదం భూరితేజః ప్రధర్షతి దివానక్తం బిభృయు స్తజ్జనాసః.

—బృహదారణ్యకే.

అగ్నిర్వై హోతారః, చక్రం పాంచజన్యస్తు తప్తా ద్విభుజే ధారయేత్, ఆత్మహిత మాచరేత్, ఆచార్యాయ స్వముఖం ప్రపద్యేత్, తద్వైష్ణవోఽభవతి, పునరాగతిర్న, సాయుజ్యం సాలోక్యతా మాప్నోతి; అథ కాత్యాయనేతి హోవాచ, జ్ఞానం వై పురుషో బ్రహ్మణో జాయతే, సవై బ్రాహ్మణో భవతి, వశిష్ఠః కశ్యపోఽత్రి ర్జమదగ్ని ర్విశ్వామిత్రోఽయం వ్యాసః పారాశర్య స్సనకాదయో గదా స్సద్బ్రహ్మలోకో భవతి, సానందలోకో భవతి, తప్తం చక్రం ద్విభుజే ధార్య మిత్యగ్నిహోత్ర ఏవ లోకో భవతి, ఊర్ధ్వపుండ్ర మాలిఖేత్, తస్మా ద్ద్విరేఖం భవతి, బ్రాహ్మణ స్సాయుజ్యగం సలోకతా మాప్నోతి.

—అథర్వణే.

యజ్ఞోపవీతీ ధృతచక్రధారీ యో బ్రహ్మవిద్బ్రహ్మవిదోఽమనీషా.

—సుదర్శనోపనిషత్.

ఇత్యాది శ్రుతిప్రమాణములచే చక్రాంకనసంస్కారము వేదవిధి యగుబ్రాహ్మణధర్మమే నని తెలియజేయుచు, స్మృతులచే తెలియదగుప్రమాణముల ప్రదర్శించెదను.

శ్లో॥ అష్టమాషోడశాదబ్దా ద్ధార్యం చక్రాదిధారణం,
ప్రతిష్ఠై రంకనం పశ్చాత్సదా వా భూషణం స్త్రియాః,
జాతకర్మణి వా కుర్యా చ్చౌలోపనయనేఽపి వా,
వేదాధ్యయనకాలే వా చక్రచిహ్నం విధానతః.

—వాశిష్ఠస్మృతౌ.

అనియును—

శ్లో॥ చక్రలాంఛనహీనస్య ద్విజత్వం నిష్ఫలం భవేత్,
అచక్రధారిణం విప్రం యశ్శ్రాద్ధే భోజయే న్నరః
రేతోమూత్రపురీషాది స పితృభ్యః ప్రయచ్ఛతి,
శంఖచక్రోర్ధ్వపుండ్రాది రహితో బ్రాహ్మణాధమః,
జీవ న్నేవ స చండాల స్సర్వకర్మసు గర్హితః.

—పరాశరస్మృత్యుత్తరఖండే.

శ్లో॥ అధృత్వా విధనా చక్రం బ్రాహ్మణో జ్ఞానదుర్లభః,
గర్హిత స్సర్వలోకేషు బ్రాహ్మణ్యా త్ప్రచ్యుతో భవేత్.

అనియును—

శ్లో॥ శృణు రాజన్ మహాబాహో విష్ణుచక్రాదిధారణం,
శూద్రధర్మరతానాంహి తేషాం నాస్తి పునర్భవః.

—ధర్మసారే-పాద్మోత్తరఖండే.

అనియును—

శ్లో॥ విప్రై స్సైతై ర్వగృహీత్వా త్ప్రాయశ్చిత్త ముదీరితం
పశ్చాత్తాపసమాయుక్తః ప్రాయశ్చిత్త మిదం చరేత్.

—ధర్మసారే - పద్మపురాణే.

అనియును—

శ్లో॥ హుతాగ్నితప్తచక్రాద్యై రాయుధైః పంచభి ర్హరేః,
ప్రతప్తబాహుమూలా యే ప్రాప్నుయు స్తే పరం పదం.

—ధర్మసారే - నారదీయే.

అనియును—

శ్లో॥ అచక్రధారిణం మంత్ర మధ్యాపయతి దేశికః,
శిష్యేణ నరకం యాతి కల్పకోటిశతం ద్విజః,
తస్మా త్తాపాదిసంస్కారం కృత్వా మంత్ర మనుత్తమం,
అధ్యాపయే ద్గురు స్సమ్య గన్యథా నరకం వ్రజేత్.

—పరాశరస్మృత్యుత్తరఖండే.

అనియును.

శ్లో॥ ఆధారకాద్యాః కర్మణ్యా ఏవం చక్రాదిలాంఛితాః,
దేవతాంతరచిహ్నైస్తు అకర్మణ్యాస్తు లాంఛితాః.
—శ్రీమహాభారతే - భీష్మపర్వణి.

అనియును—

శ్లో॥ చక్రలాంఛనహీనేన కృతం కర్మచ నిష్ఫలం.
—పరాశరస్మృత్యుత్తరఖండే - ప్రథమోధ్యాయే.

అ యును—

శ్లో॥ బ్రాహ్మణైః క్షత్రియై ర్వైశ్యైః శూద్రైశ్చ కృతలక్షణైః,
అర్చనీయశ్చ సేవ్యశ్చ నిత్యయుక్తై స్స్వకర్మసు.
—శ్రీమహాభారతే - భీష్మపర్వణి.

అనియును—

శ్లో॥ సంస్కృతాః పంచసంస్కారై స్తాపాద్యై ర్వైష్ణవై శ్శుభైః,
నారాయణం ప్రపద్యేరన్ నరా వై మోక్షకాంక్షిణః.
—శ్రీప్రశ్న సంహితాయాం.

అనియును—

శ్లో॥ విష్ణ్వర్చనాసు దీక్షాంచ పంచసంస్కారమార్గతః.
—వశిష్ఠః.

అనియును—

శ్లో॥ దీక్షితః పంచసంస్కారైః పంచకాలపరాయణః,
ఆత్మార్థంవా పరార్థంవా నిత్యం హరి ముపాసతే,
నచ దేవలకో జ్ఞేయో స్సర్వశాస్త్రేషు నిశ్చయః.
—శ్రీపాంచరాత్రాగమాంతర్గతఖగప్రశ్నసంహితాయాం

ఇత్యాదిబహుప్రమాణములచే, శ్రుతి స్మృతి పురాణాగమాదిప్రసిద్ధంబులయిన పంచసంస్కారంబులచే సంస్కరింపబడిన భగవదారాధనపరులగు శ్రీపాంచరాత్రాగమదీక్షాపరులకు దేవలకత్వదోషము లేదు.

శ్రీపాంచరాత్రాగమము స్వతంత్రప్రమాణం బనువిషయంబు పంచమవేదం బగు భారతంబున నారాయణీయోపాఖ్యానంబున సుస్పష్టంబు. వేదబాహ్యశైవాగమాదులవలె నప్రమాణం బని శాస్త్రిగారికి తోచినను, వీరిమతగురువులగు శ్రీశంకరాచార్యులచే రచియింపంబడిన సూత్రభాష్యంబున "(సూ) పత్యురసామంజస్యాత్, ఉత్పత్త్యసంభవాత్" అను నధికరణంబులను బాగుగ జూచినయెడల పూర్వపక్షిగారికి సుస్పష్టంబుగా తెలగలదు. ఏల యన శ్రీపాంచరాత్రోక్తంబులగు నభిగమనేజ్యోపాదానాదుల నంగీకరించెదమనియు, జీవోత్పత్త్యాదికంబుమాత్రము నిరసనీయం బనియు వ్రాసియున్నారు. కాని యిజ్యాంగంబగు పంచసంస్కారదీక్షను ఖండించియుండలేదుగదా. అట్టివిషయంబున శాస్త్రిగారి కిట్టిప్రయాస నిరర్థకంబే యగును! పాశుపతాదిశాస్త్రంబులు వేదబాహ్యంబు లగుట సర్వజనవేద్యంబే. ఇదియునుంగాక, వీరిపూర్వధర్మశాస్త్రరచయితలుకూడ పంచసంస్కారంబును ప్రమాణవేద్యంబుగా నంగీకరించియేయుండిరి. ఇందులకు నిదర్శనంబు నిర్ణయసింధువే యగును. రామార్చనచంద్రికా రామనామమాహాత్మ్యకారాదులు తదీయులే కదా. వారేల యిట్టి విషయంబున ఖండనమునకు పూనుకొనలేదు? పంచసంస్కారము బ్రాహ్మణలక్షణం బనియు, అభావంబున దోషం బనియు, సుస్పష్టంబుగ జెప్పియుండిరి. అనంతరీకులగు పృథ్వీచంద్రోదయకారాదులట్టి ధర్మశాస్త్రంబు నతిక్రమించి శంకరహృదయంబును బరిష్కారింపక తోచినకొలంది నిర్ణయంబునకు బాల్గొనిరి. ఇంతమాత్రంబున మాకేమి హాని వాటిల్లును? ద్వైతమతకర్తలు సంస్కారంబుల విషయంబై మాతో నేకీభవించియేయుండిరి. ఇటుల త్రిమతకర్తలును ప్రమాణతమంబుగా దీక్షావిధి యను నిద్దాని నంగీకరించియే యుండుటచే శ్రీపాంచరాత్రంబునకు పూర్ణప్రాశస్త్యము గల్గినది. శ్రీపాంచరాత్రాగమ దివ్యశాస్త్రము వేదమూల మనియు, భగవచ్ఛాస్త్ర మనియు, సాత్వతతంత్ర మనియు, భగవచ్ఛాసన మనియు నామాంతరములచే నొప్పుచున్నది.

ఇది శ్రీ పాంచరాత్రాగమ దివ్యశాస్త్రవిషయప్రదర్శినియందు
చక్రాంకన దీక్షావిధియను తృతీయ ప్రకరణము.

శ్రీరస్తు.

# శ్రీపాంచరాత్రాగమదివ్యశాస్త్రవిషయప్రదర్శని

అను

# తాంబూలదుర్వాదఖండనము.

## చతుర్థప్రకరణము.

### శ్రీపాంచరాత్రశాస్త్రవిషయము

శ్రీపాంచరాత్రాగమం దివ్యశాస్త్ర మిత్యుక్తం.

శ్లో॥ శ్రౌతం వైఖానసం ప్రోక్తం శాశిష్టం స్మార్త ముచ్యతే,
పాంచరాత్రాభిధం శాస్త్రం దివ్యాగమ మితీరితం.

—పాద్మపురాణే.

తదష్టోత్తరశతసంహితాత్మకం శ్రీపాంచరాత్రదివ్యశాస్త్రం.

ఇట్టిదివ్యశాస్త్ర విషయమై మతాంతరులైన శాస్త్రిగారికి పాంచరాత్రమన నేమో తెలియకపోవచ్చును. అందుచేత శ్రీపాంచరాత్రాగమ మనగా సాత్వతతంత్ర మని తెలియదగు ప్రమాణము.

శ్లో॥ తృతీయ మృషిసర్గం వై దేవర్షిత్వ ముపేత్య సః,
తంత్రం సాత్వత మాచష్ట నైష్కర్మ్యం కర్మణాం యతః.

—శ్రీమద్భాగవతే - తృతీయోధ్యాయే.

అను శ్లోకమునకు శ్రీధరీయ వ్యాఖ్యానము:—

"సాత్వతం తంత్రం పాంచరాత్రశాస్త్ర మాచష్ట అవోచత్, ప్రవర్తయామాసేత్యర్థః. సాత్వతం వైష్ణవం తంత్రం పాంచరాత్రాగమం ఆచష్ట ఉక్తవాన్" అని వివరించియున్నందున శ్రీపాంచరాత్రాగమ మనగా సాత్వతతంత్ర మని తెలియదగియున్నది.

భగవచ్చతుర్వ్యూహప్రదర్శకశాస్త్ర మని తెలియదగు ప్రమాణము.

శ్లో॥ అన్యే ప్యేవం విజానంతి మాం రాజన్ పాంచరాత్రికాః,
వాసుదేవంచ రాజేంద్ర సంకర్షణ మథాపివా,
ప్రద్యుమ్నం చానిరుద్ధంచ చతుర్మూర్తిం ప్రచక్షతే.
—శ్రీమహాభారతే- మోక్షధర్మే.

అను ప్రమాణముచే శ్రీపాంచరాత్రభగవచ్ఛాస్త్రము భగవచ్చతుర్వ్యూహప్రదర్శకం బని తెలియుచున్నది. అట్టి భగవచ్ఛాస్త్ర మేకాయనశాఖామూల మని తెలియదగు ప్రమాణము:—

వాకో వాక్య మేకాయనం దేవవిద్యామ్ బ్రహ్మవిద్యామ్.
—ఛాందోగ్యోపనిషత్.

అని యిట్టుల నేకాయనశాఖామూల మయిన శ్రీపాంచరాత్రాగమశాస్త్రము భగవంతునిచే స్వయముగా ప్రకాశింపజేయ బడినది.

ఇందులకు ప్రమాణము:—

శ్లో॥ పాంచరాత్రం మహా ద్దివ్యం శాస్త్రం శ్రుతివిభావనం,
విశేషేణాధిగంతవ్యం గీతం భగవతా స్వయమ్.
—సంహితాంతరే.

అను ప్రమాణముచే భగవత్ప్రోక్త మైనదిగా తెలియం బడుచున్న పాంచరాత్రశాస్త్రము వేదమూలమే యనియును, మోక్షఫలప్రదం బైనదే యనియు ననుటకు ప్రమాణము.

శ్లో॥ తత్పాంచరాత్రం శ్రుతిమూలభూతం స్మృత్యర్థవిస్తారసుబోధకందం,
అపౌరుషేయం హరిభక్తిబీజం పరంపదప్రాప్తిసుఖైకదక్షం.
—సంహితాంతరే.

అని భగవద్భక్తి బీజాభిమతరూప మగు శ్రీపాంచరాత్రాగమశాస్త్రము అనేకమంది ఋష్యాదులచే సంహితారూపములతో

జ్ఞాన యోగ, చర్యా, పాదాధ్యాయభేదములుగా భగవద్గీతారాధనాది సాత్వతధర్మంబుల బహువిధములుగా ప్రకాశింపబడిన దనుటకు ప్రమాణము.

శ్లో॥ లోకే తత్పాంచరాత్రం బహుమునికథితాస్సంహితాశ్చాప్యనేకాః
వర్తంతే సాత్వతాఖ్యా భగవదభిమతైరర్చనాద్యైర్విధానైః
జ్యోతిశ్శిల్పాదిశాస్త్రైరపిచ బహుమహామంత్రవాస్తు ప్రయోగై
శ్చర్యాజ్ఞానాదిపాదైస్సుఖతరవిశదాధ్యాయరత్నైరుపేతాః॥
—పురుషోత్తమ సంహితాయాం.

శ్లో॥ ఇదం శతసహస్రాద్ధి భారతాఖ్యాన విస్తరాత్
ఆవిధ్య మతిమంథానం దధ్నో ఘృత మివోద్ధితం
నవనీతం యథాదధ్నో ద్విపదాం బ్రాహ్మణో యథా
ఆరణ్యకంచ వేదేభ్య ఓషధీభ్యో యథామృతం
ఇదం మహోపనిషదం చతుర్వేదసమన్వితం
సాంఖ్యయోగకృతాంతేన పాంచరాత్రానుశబ్దితం
నారాయణముఖోద్గీతం నారదోఽ శ్రావయన్ మునీన్
బ్రాహ్మణ స్సదసీ తాత యథాదృష్టం యథాశ్రుతం
ఇదం శ్రేయ మిదం బ్రహ్మ మిదం హిత మనుత్తమం
ఋగ్యజుస్సామభి ర్జుష్ట మథర్వాంగిరసై స్తథా
భవిష్యతి ప్రమాణంవై ఏతదే వానుశాసనం॥
—శ్రీమహాభారతే - శాంతిపర్వణి.

అనియును—

శ్లో॥ బ్రాహ్మణ స్సర్వవర్ణేషు యతి శ్చాశ్రమిషూత్తమః
యద్వద్గంగాచ తీర్థేషు దైవతేష్వపి చాచ్యుతః।
తద్వత్సర్వేషు శాస్త్రేషు పాంచరాత్రం ప్రశస్యతే
ఇదం పవిత్రం పాపఘ్నం శాస్త్రం భవవినాశనం
సంసారార్ణవమగ్నానాం కర్మపాశానుపేయుషా
మహోపోతేన సదృశం తారకం భవసాగరాత్.
—పాద్మతంత్రే.

అనియును—

శ్లో॥ శృణుధ్వం మునయ స్సర్వే వేద మేకాయనాభిధం
పాంచరాత్రం మూలవేదం సాత్వతం తంత్ర మిత్యపి
భగవచ్ఛాస్త్ర మితి త న్నామభిః పరిపఠ్యతే
మోక్షాయనాయవై పంథా ఏతదన్యో న విద్యతే
తస్మా దేకాయనం చేతి ప్రవదంతి మనీషిణః
ఆచారకథనా ద్దివ్యగతిప్రాప్తివిధానతః
మాహాత్మ్యం తత్త్వకథనా దాగమ శ్చేతి గణ్యతే
మహతో వేదవృక్షస్య మూలభూతో మహా నయం
ఋగాద్యా స్స్కంధభూతా స్తే శాఖాభూతా శ్చ యోగినః
జగన్మూలస్య వేదస్య వాసుదేవస్య ముఖ్యతః
ప్రతిపాదకతాసిద్ధ మూలవేదాఖ్యతా ద్విజాః
సత్వస్వరూపహారిణా ప్రోక్తత్వా త్సాత్వతం మతం
తనోతి విపులా నర్థాన్ తత్త్వమంత్ర సమాశ్రితాన్
త్రాణంచ కురుతే యస్మా త్తంత్ర మిత్యభిధీయతే
పాంచరాత్రంతు సర్వేషాం శాస్త్రాణాం మూలకారణం.

—పురుషోత్తమ సంహితాయాం.

ఇత్యాది ప్రబలప్రమాణములచే శ్రీమన్నారాయణ ముఖోద్గీతమైన శ్రీపాంచరాత్రమహాశాస్త్రము, సర్వప్రమాణసార్వభౌమం బని నుడువుట కేయభ్యంతరము లేదు. ఇట్టిశాస్త్రము సాక్షాద్భగవత్కృతముగా ప్రకాశించుచున్నందున నట్టిశాస్త్రావతారప్రశస్తతాదులు, సక్రతుయాజకశ్రేష్ఠులయిన శాస్త్రిగారు తెలియదగునట్లు ప్రదర్శించెదను.

ఇది శ్రీపాంచరాత్రాగమ దివ్యశాస్త్ర విషయప్రదర్శనియందు
పాంచరాత్ర శాస్త్రవిషయమను చతుర్థప్రకరణము
సంపూర్ణము.

---

*

శ్రీరస్తు.

# శ్రీ పాంచరాత్రాగమదివ్యశాస్త్రవిషయప్రదర్శిని

అను

# తాంబూల దుర్వాదఖండనము.

## పంచమ ప్రకరణము.

### శ్రీ పాంచరాత్ర శాస్త్రావతార విషయము.

శ్లో॥ పురుషో యో జగద్బీజ మృషి ర్నారాయణ స్స్మృతః.
—పరాశరస్మృతౌ.

శ్రీమన్నారాయణుడే జగత్కారణ పురుషుడు.

శ్లో॥ భగవా నితి శబ్దోఽయం తథా పురుష ఇత్యపి,
నిరుపాధీతు వర్తేతే వాసుదేవే సనాతనే.

అట్టి వాసుదేవునియందు భగవచ్ఛబ్దంబును, పురుషశబ్దంబును, నిరుపాధికంబుగ వర్తించుచున్నది. మరియు

శ్లో॥ దేవతిర్యఙ్మనుష్యేషు పున్నామా భగవాన్ హరిః,
స్త్రీనామ్నీ లక్ష్మీ ర్మైత్రేయ నానయో ర్విద్యతే పరం.

అట్టి పురాణపురుషుడైన శ్రియఃపతి యనుభగవంతునితో నిత్యమై ప్రకాశించుచున్న మంగళకర వాచ్యమే లక్ష్మి. "అథపురుషోహవై నారాయణో కామయతా ప్రజా స్సృజేయేతి" 'అట్టి పురుషశబ్దవాచ్యుండగు నారాయణుడే ప్రజల నందర సృష్టించెద నని తలంచెను.' అనుపలుల జగత్సృష్టిరక్షకుండైన నారాయణుడు "లక్ష్మ్యాసహా హృషీకేశో దేవ్యా కారుణ్యరూపయా" అనియు "ఆస్తే విష్ణు రచింత్యాత్మా భక్తై ర్భాగవతైస్సహ" అనియు ప్రమాణంబులచే కారుణ్యరూపయగు లక్ష్మీఅమ్మవారితోను షడ్గుణైశ్వర్యసంపన్నుడైన శ్రియఃపతి వైకుంఠంబున శేషాహిశయ్యపై బవళించియుండ శ్రీ భూనీళలు

పాదసేవ యొనర్చుచుండు సమయంబున జగజ్జీవనోపాయం బైన భక్తియోగం బగు భగవదారాధనరూపమోక్షసాధకధర్మం బను గ్రహింపు మని.

శ్లో॥ అభ్యర్థితో జగద్ధాత్ర్యా శ్రియా నారాయణ స్స్వయం,
అనియును—

శ్లో॥ వేదవేద్య స్స భగవాన్ కృపయా పరయాఽచ్యుతః,
చతుర్విధ మిదం ప్రాహ సర్వేషాం హితకారణాత్.
అనియును—

శ్రీదేవి ప్రార్థింప వేదవేద్యుండును, భగవంతుండును, అచ్యుతుండు నగు నారాయణుండు పరమకృపచేత సర్వజనులకు హితం బగునటుల జ్ఞానయోగక్రియాచర్యారూపచతుర్విధంబుగ పాంచరాత్రంబును బలికెను.

శ్లో॥ మమ స్వరూపం సర్వస్మా త్పరస్య జగదీశితుః,
షడ్విధం పరిపూర్ణం త త్సేనేశ పరిపఠ్యతే.
—భారద్వాజసంహితాయాం.

అను ప్రమాణానుసారము సర్వజగత్కారణభూతుడను నేనే ననియు.

శ్లో॥ ఆచార్యవాన్ పురుషో వేద ఆచార్యా ద్ధైవవిద్యా విదితా సాధిష్ఠం ప్రాపయత్.
—శ్రుతి.

అనియును—

శ్లో॥ సర్వేషాం ప్రథమాచార్యం శ్రీనివాసం...
అనుప్రమాణానుసారము స్వయమాచార్యస్వరూపుడై.

శ్లో॥ లక్ష్మ్యాః పురుషకారత్వే నిర్దిష్టా పరమర్షిభిః,
మమాపిచ మతం హ్యేత న్నాన్యథా లక్షణం భవేత్.
—భారద్వాజసంహితాయాం.

అను ప్రమాణముచే నొప్పుచున్న పురుషాకారభూతురాలగు లక్ష్మీఅమ్మవార్లకు.

భగవా నువాచ:—

శ్లో॥ యత్రైవ కర్మకాండేషు దీక్షోక్తా యోగసిద్ధయే,
తత్రైవైకాయనా వేదే పూజా యోగాదిసిద్ధయే,
దీక్షాయా శ్రేష్ఠతాం కర్తుం విభజ్యాత్మాన మబ్జజే,
ప్రథమం శబ్దరూపేణ వృత్తిరూప మతఃపరం,
అర్థరూపం తృతీయస్తు తత్రైవాచార్యరూపిణం,
దీక్షారూపం పంచమంతు ప్రవిశ్యచ యథాక్రమం,
మయా కృతో యస్య దీక్షా సోహమేవ న సంశయః.

—శ్రీప్రశ్న సంహితాయాం.

అనియును—

శ్లో॥ ఏవంవిధ స్స్వ ధర్మేణ యుక్తస్యానన్యచేతసః,
నిత్య మారాధనం విష్ణో ర్యత్తదాస్య మిహోచ్యతే.

అనియును.

శ్లో॥ "అర్థోవా ఏవ ఆత్మనః యత్పత్నీ"

—శ్రుతిః

అను ప్రమాణానుసార మర్ధాంగీస్వరూపురాలగు శ్రీ మహాలక్ష్మికి ఉత్తమపురుషార్థమగు నభిగమనేజ్యోపాదానాత్మకభగవదారాధనము ననుగ్రహించి, ఏతద్ధర్మమును

శ్లో॥ ఆచార్యో లబ్ధవేదార్థం

అనుక్రమమాణానుసారము వేదవేదాంగములు వేదపురుషుడైన శ్రీమన్నారాయణుడు సృష్ట్యాది బ్రహ్మయం దుపదేశించెను. ఇందులకు ప్రమాణము.

శ్లో॥ అధాబ్జనేత్రేణ పురాబ్జజన్మనే సుబోధితః పంచభి రేవ రాత్రిభిః
సమగ్రమర్థాధికకోటిసంఖ్యయా సపాంచరాత్రాగమ మిత్యుదీరితః.

—పురుషోత్తమ సంహితాయాం.

శ్లో॥ తథాగమం శేషఖగేశసైన్యపాః,
పురందరాద్యాశ్చ తత స్సురర్షయః,

క్రమేణ సమ్యక్ప్రతిపద్య సారం,
దదు ర్మునిభ్య స్తు హరే రనుజ్ఞయా.

అని భగవదాజ్ఞగా శ్రీమన్నారాయణునిచే, అనంత, గరుడ, విష్వక్సేన, బ్రహ్మ, ఇంద్రాదుల కయిదురాత్రములలో శ్రీపాంచరాత్రాగమదివ్యశాస్త్ర ముపదేశరూపముగా అవతరింప చేయబడినది. ఇట్లవతరింప జేయబడిన భగవద్ధర్మము కర్మత్రయ స్వరూపతత్త్వజిజ్ఞాసాధర్మమే యని తెలియదగు ప్రమాణము.

శ్లో॥ కర్మత్రయేచ మద్భక్తో యది కశ్చి ద్భవిష్యతి,

అనియును—

శ్లో॥ వేదాంతై రిద మేవోక్తం తత్త్వజ్ఞానోపపాదకైః.

అనియును—

శ్లో॥ దోషాభావేతు విజ్ఞేయో సత్తామాత్రోపకారిణః.

—యామునాగమే - కూర్మపురాణే.

అను ప్రమాణములచే శ్రీపాంచరాత్రదివ్యాగమశాస్త్రము దోషాభావస్వరూపసత్తామాత్రోపకారిగా నవతరించిన దని పూర్వపక్షులు తెలియవలెను.

అట్టి మహాశాస్త్రము

శ్లో॥ తస్య వేదాః పంచరాత్రం నిత్యం హృది వసిష్యతి
యదిదం పంచరాత్రం మే శాస్త్రం పరమదుర్లభం
తద్భవా న్వేత్స్యతే సర్వం మత్ప్రసాదా దసంశయః.

అనియును— —యామునాగమే.

శ్లో॥ వేదప్రశంసా బహుశః పాంచరాత్రేపి దృశ్యతే,
నహి తేభ్యః పరం కించి ద్వాఙ్మయం కమలాసన!

అనియును—

శ్లో॥ పాంచరాత్ర ప్రమాణత్వ నిషేధోక్తిప్రసంగతః,
తత్రానువాదసందేహ జ్ఞానానుత్పత్తి లక్షణం.

అను ప్రమాణానుసారముగ శ్రీమన్నారాయణునిచే నవతరింప జేయబడి బ్రహ్మేంద్రాదుల కుపదేశింపబడిన శ్రీపాంచరాత్రాగమ భగవచ్ఛాస్త్ర ప్రశస్తతా ప్రమాణముల ప్రతిపాదించెదను.

ఇది శ్రీ పాంచరాత్రాగమ దివ్యశాస్త్ర విషయప్రదర్శినియందు శాస్త్రావతారమను పంచమప్రకరణము సంపూర్ణము.

శ్రీరస్తు.

# శ్రీపాంచరాత్రాగమదివ్యశాస్త్రవిషయప్రదర్శని

అను

# తాంబూలదుర్వాదఖండనము.

## షష్ఠప్రకరణము.

### శ్రీపాంచరాత్రాగమ శాస్త్రప్రశస్తతా విషయము.

ఇట్లు శ్రీమన్నారాయణునిచే నుద్భవింపజేసిన భగవచ్ఛాస్త్రకలితముగా ముక్త్యుపాయవిషయమై ఋషిప్రశ్నానంతరము వశిష్ఠప్రతివచనము.

శ్లో॥ భగవద్భక్తి రేవ స్యా ద్భక్తానాం ముక్తికారణం
తద్భక్తిబోధకం శాస్త్రం పాంచరాత్రాగమం శ్రుతం
రజోగుణాశనోదాయ బ్రహ్మణే విష్ణునా పురా
యదుక్తం పాంచరాత్రాఖ్యం రహస్యామ్నాయ ముత్తమం
తచ్ఛ్రుణుధ్వం మునిశ్రేష్ఠా స్సంసారాంబుధితారకం
సార్ధకోటిప్రమాణేన బ్రహ్మణా కేశవా చ్ఛ్రుతం
రాత్రిభిః పంచభి స్సర్వం పాంచరాత్రాగమం స్మృతం
ఏతదాగమశాస్త్రేణ బింబదేవాలయాదికం
వినిర్మాయ ప్రతిష్ఠాప్య నిత్య మారాధయ న్నరః
శాశ్వతం పద మాప్నోతి పునరావృత్తివర్జితం.

—పురుషోత్తమ సంహితాయాం.

అనుప్రమాణముచే భగవద్భక్తియే భక్తులకు ముక్తికారణంబగు తద్భక్తిని బోధించునది శ్రీపాంచరాత్రతంత్రము. బ్రహ్మకు రజోగుణనివృత్తికై శ్రీమహావిష్ణువు, ఏపాంచరాత్ర శాస్త్రమును ఉత్తమమగు రహస్యార్థము నుపదేశించెనో అట్టి సార్ధకోటిప్రమాణంబును సంసారసాగరతారకంబును అయిదుదినములలో నుపదేశింప

బడినదియు నగుపాంచరాత్రశాస్త్రముచే బింబదేవాలయాదుల నిర్మించి ప్రతిష్ఠించి నిత్యసమారాధనంబు చేసి శాశ్వతమై పునరావృత్తి శూన్యమైనపదమును నరుడు పొందగలడు, అని యాబ్రహ్మచే తనకు కృపచేయబడినట్లుగా వసిష్ఠులవారిచే నీశాస్త్రావతారమును చెప్పిన విమ్మట.

శ్లో॥ భగవ న్మునిశార్దూల! సర్వశాస్త్రవిశారద!
కైవల్యపద మిచ్ఛూనా మస్మాకం శరణార్థినాం
తత్పాంచరాత్రశాస్త్రస్య విధానం సంప్రకాశయ.

—ఋషిప్రశ్నః.

శ్రీపాంచరాత్రాగమశాస్త్రవిధవిధానములను మోక్షాపేక్షులమైన మాకెల్లరకు ప్రకాశింపజేయవలసిన దని సర్వవిద్యావిశారదమునిశిఖామణి యగు వసిష్ఠులవారిని నాఋషు లందరు ప్రశ్న చేయగా,

శ్లో॥ శృణుధ్వం మునయ స్సర్వే వేద మేకాయనాభిధం
పాంచరాత్రం మూలవేదం సాత్వతం తంత్ర మిత్యపి
భగవచ్ఛాస్త్ర మితి తన్నామభిః పరిపఠ్యతే
మోక్షాయనాయవై పంథా ఏతదన్యో న విద్యతే
తస్మా దేకాయనం చేతి ప్రవదంతి మనీషిణః
ఆచారకథనా ద్దివ్యగతిప్రాప్తివిధానతః
మాహాత్మ్యం తత్త్వకథనా దాగమ శ్చేతి గణ్యతే
మహతో వేదవృక్షస్య మూలభూతో మహా నయం
ఋగాద్యా స్స్కంధభూతా స్తే శాఖాభూతాశ్చ యోగినః
జగన్మూలస్య వేదస్య వాసుదేవస్య ముఖ్యతః
ప్రతిపాదకతాసిద్ధమూలవేదాఖ్యతా ద్విజాః
తత్త్వస్వరూపమారిణా ప్రోక్తత్వా త్సాత్వతం మతం
తనోతి విపులా నర్థాన్ తత్వమంత్రసమాశ్రితాన్
త్రాణంచ కురుతే యస్మా త్తంత్ర మిత్యభిధీయతే
పాంచరాత్రంతు సర్వేషాం శాస్త్రాణాం మూలకారణం
బ్రాహ్మణా స్సర్వవర్ణేషు యతి శ్చాశ్రమిషూత్తమః

యద్వద్గంగాచ తీర్థేషు దైవతేష్వపి చాచ్యుతః
తద్వత్సర్వేషు శాస్త్రేషు పాంచరాత్రం ప్రశస్యతే
పాంచరాత్రం మహద్దివ్యం శాస్త్రం శ్రుతివిభావనం
విశేషేణాధిగంతవ్యం గీతం భగవతా స్వయం.

—వసిష్ఠ ప్రతివచనం.

అని శ్రీపాంచరాత్రాగమము ఏకాయనవేదమూల మని పేరు గలదియును 'సాత్వతం తంత్రం భగవచ్ఛాస్త్రం ఆగమం' అను నామాంతరములచే బహువిధముల కొనియాడబడినదియు భగవద్దివ్య గతి ప్రతిష్ఠావిధాన మగు ఆచారమాహాత్మ్యతత్త్వకథనాదులతో గూడి ఆగమ మను గణ్యత నొందినదియు భగవత్సాన్నిధ్యమును జెందుటకు సులభోపాయప్రపత్తిస్వరూప మహాధర్మమనియు వేదవృక్షమునకు మూలభూతమై ఋగాదిస్కంధఋషిశాఖలుగా వేదపురుషుండగ వాసుదేవునిచే స్వప్రతిష్ఠితమై, ప్రవర్తింపజేయబడిన మూలవేదము వశిష్ఠులవారిచే ఋష్యాదుల కుపదేశింపబడియె

అట్టి భగవచ్ఛాస్త్రము హితకామ్యధర్మస్వరూపమనియు ముముక్షువుల కావశ్యకమయిన మోక్షధర్మ మనియు పరమైకాంతి ధర్మమనియు తెలియజేయు ప్రమాణము.

శ్లో॥ వేదై శ్చతుర్భి స్సహితం కృతం మేరౌ మహాగిరౌ
ఏకాగ్రమనసో దాంతా ఋషయ స్సమయేరతాః
దివ్యం వర్షసహస్రం వై సర్వే తే మునయ స్సమం
నారాయణానుశిష్టాహి తథా దేవీ సరస్వతీ
వివేశ తాన్ ఋషీన్ సర్వాన్ లోకానాం హితకామ్యయా,
తైరేకమతిభి ర్భూత్వా యత్ప్రోక్తం శాస్త్ర ముత్తమం.

—శ్రీభాష్యే-శ్రుతప్రకాశికాయా

శ్లో॥ అహోహి దురనుష్ఠేయో మోక్షధర్మ స్సనాతనః,
యం హిత్వా దేవతా స్సర్వా హవ్యకవ్యభుజో భవన్,

నూన మేకాంతిధర్మోయం శ్రేష్ఠో నారాయణప్రియః
ఏకాంతినోహి పురుషా గచ్ఛంతి పరమే పదే.

అనియు—

శ్లో॥ యద్యేకాంతిభి రాకీర్ణం జగ త్స్యా త్కురునందన
భవే త్కృతయుగప్రాప్తి రాశీఃకర్మవివర్జితా
ఏకాంతభావోపగతా స్తే భక్తాః పురుషోత్తమం
తే సహస్రార్చిషం దేవం ప్రవిశంతి సనాతనం.

అని యిట్టి ప్రమాణములచే శ్రీపాంచరాత్రాగమభగవ ద్ధర్మము ముముక్షువులగు మోక్షజనులకు అత్యావశ్యకమయిన ధర్మమే నని యాభగవద్ధర్మమును లోకహితార్థము బ్రహ్మకు భగవాను లుపదేశించినట్లు తెలియుచగు ప్రమాణము.

శ్లో॥ మయా సృష్టః పురా బ్రహ్మ మద్యజ్ఞ మయజ త్స్వయం
తత స్తస్మై వరా న్ప్రీతో దదావహ మనుత్తమాన్
మత్పుత్రత్వంచ కల్పాదౌ లోకాధ్యక్షత్వ మేవచ.
—(శ్రీభాష్యే-శ్రుతప్రకాశికాయాం)

అనియును—

శ్లో॥ తే నైషా ప్రథితా బ్రహ్మన్ మర్యాదా లోకభావినీ.

అని శ్రీపాంచరాత్రాగమము లోకహితార్థమై ప్రవర్తించిన దని యనేకవిధముల కొనియాడియున్నారు.

మరియు—

శ్లో॥ వేదేన పాంచరాత్రేణ భక్త్యా యజ్ఞేనచ ద్విజ
ప్రాప్యోహం నాన్యథా ప్రాప్యో వర్షలక్షశతైరపి.
—కూర్మపురాణే.

అనియును—

శ్లో॥ తస్మాదేకేన మనసా భగవాన్ సాత్వతాంపతిః
శ్రోతవ్యః కీర్తితవ్యశ్చ ధ్యేయః పూజ్యశ్చ నిత్యశః
యదనుధ్యాసినాయుక్తః కర్మగ్రంధినిబంధనం॥
—శ్రీమహాభాగవతే – ద్వితీయాధ్యాయే.

అనియును—.

శ్లో॥ అనర్థోపశమం సాక్షాద్భక్తియోగ మధోక్షజే
లోకస్యాజ్ఞానతో విద్వాంశ్చక్రే సాత్వతసంహితాం.
—శ్రీమహాభాగవతే - సప్తమాధ్యాయే.

ఇత్యాదిప్రమాణములచే సాత్వతతంత్రంబైన శ్రీపాంచరాత్రాగమ భగవచ్ఛాస్త్రావతార ప్రశస్తతాదుల శాస్త్రిగారు తెలియదగియున్నది.

అట్టి ప్రశస్తతాధిక్యతలు గల శ్రీపాంచరాత్రాగమోక్త భగవద్దేవతార్చనావిధి సర్వోత్కృష్టతమంబైనదిగా చతుర్వర్ణములవారికిని ఆచరణీయమైనదేయని అర్చనావిధి విషయమై విమర్శించెదను.

ఇది శ్రీ పాంచరాత్రాగమ దివ్యశాస్త్ర విషయప్రదర్శనియందు
పాంచరాత్ర శాస్త్రవిషయమను షష్ఠప్రకరణము

సంపూర్ణము.

---

శ్రీరస్తు.

# శ్రీపాంచరాత్రాగమదివ్యశాస్త్రవిషయప్రదర్శని

అను

# తాంబూల దుర్వాదఖండనము.

## సప్తమ ప్రకరణము.

### భగవ ద్దేవతార్చనా విధి విషయము.

శాస్త్రిగారు శ్రీపాంచరాత్రస్వాములను అర్చకులని శంకించినందుకు—

శ్లో॥ సబ్రహ్మకా సరుద్రాశ్చ సేంద్రా స్సర్షిభి స్తథా
అర్చయంతి సురశ్రేష్ఠం దేవం నారాయణం ప్రభుం.

—శ్రీభాష్యే.

అను ప్రమాణముచే బ్రహ్మరుద్రేంద్రాదిసమస్తఋషులు శ్రీమన్నారాయణమూర్తి నర్చించి పూజించి అర్చకులయి యుండిరని తెలియదగియున్నది.

శాస్త్రిగారు తమకు దేవతార్చన లేనందున తాము అర్చకులు కాకపోవచ్చును. శాస్త్రిగారికి దేవతార్చనము లేకుండ వేదషట్కర్మాధికారశ్రోత్రియ బ్రాహ్మణత్వము ఎట్లు సిద్ధించుచున్నదో షట్కర్మనిరతులైన శుద్ధశ్రోత్రియబ్రాహ్మణులకు ప్రతినిత్యము దేవతార్చనము చేయవలయు ననియును, అట్టిభగవద్దేవతార్చనమే అన్నిధర్మములకంటె నధికమైనధర్మ మని శాస్త్రిగారికి తెలియవలసిన దేవతార్చనావిషయ ప్రమాణముల ప్రతిపాదించెదను.

శ్లో॥ కో ధర్మ స్సర్వధర్మాణాం భవతః పరమో మతః.

—శ్రీమహాభారతే - అనుశాసనికే

అని భీష్మయుధిష్ఠిర సంవాదమున సర్వధర్మములలోను నే ధర్మ మెక్కుడైనధర్మ మని ధర్మరా జడుగగా—

భీష్మ ఉవాచ.

శ్లో॥ ఏష మే సర్వధర్మాణాం ధర్మోఽధికతమో మతః
యద్భక్త్యా పుండరీకాక్షం స్తవై రర్చే న్నర స్సదా.

అని శ్రీమహావిష్ణు దేవతార్చనమే అన్ని ధర్మములలో పరమధర్మ మని భీష్ములవారు తెలియజెప్పిరి.

శ్లో॥ సంధ్యాస్నానం జపో హోమో దేవతానాంచ పూజనం
వైశ్వదేవాతిథేయంచ షట్కర్మాణి దినేదినే.
—పరాశరస్మృతౌ - ఆచారకాండే.

అను ప్రమాణానుసారముగ షట్కర్మనిరతులైన బ్రాహ్మణులకు దేవతార్చనము విధిగా నిత్యమును చేయవలసిన దని తెలియవలెను. మరియును—

శ్లో॥ తస్మా దేకేన మనసా భగవాన్ సాత్వతాంపతిః
శ్రోతవ్యః కీర్తితవ్యశ్చ ధ్యేయః పూజ్యశ్చ నిత్యశః
యదనుధ్యాసి నాయుక్తాః కర్మగ్రంథ నిబంధనం.
—శ్రీమద్భాగవతే - ద్వితీయాధ్యాయే.

అను ప్రమాణానుసారము భగవద్దేవతార్చనము చేయువారికి అనర్థకరంబైన సంసారబంధక మను జన్మకర్మాద్యవస్థలు నశించిపోవునని పూర్వపక్షులు తెలియవలెను.—

శ్లో॥ అనర్థోపశమం సాక్షా ద్భక్తియోగ మధోక్షజే
లోకస్యాజ్ఞానతో విద్వాం శ్చక్రే సాత్వతసంహితాం
—శ్రీమద్భాగవతే - సప్తమాధ్యాయే

అను ప్రమాణానుసారముగ ననర్థనివారకం బగు భగవద్భక్తియోగంబు లోకులకు తెలియకపోవుటచే సాత్వతసంహితను రచియించెను.

శ్లో॥ అతః పుంభి ర్ద్విజశ్రేష్ఠా వర్ణాశ్రమవిభాగశః
స్వనుష్ఠితస్య ధర్మస్య సంసిద్ధి ర్హరితోషణం.
—శ్రీమద్భాగవతే ద్వితీయేఽధ్యాయే.

అని భగవత్తోషణంబు వర్ణాశ్రమాచారంబుల ననుష్ఠించుటచే భగవదర్చనము మతానుగుణ్యరూపముగా నన్నివర్ణములవారికిని సిద్ధికరమైనదే యని శాస్త్రిగారు తెలియవలెను.

శ్లో॥ అర్చనం సంప్రవక్ష్యామి విష్ణో రమితతేజసః
యత్కృత్వా మునయ స్సర్వే పరం నిర్వాణ మాప్నుయుః.
—ఆగ్నేయపురాణే - పరాశరస్మృతౌ ఆచారకాండేచ.

అని శ్రీమహావిష్ణ్వర్చనమును జేసి మహర్ష్యాదులు పునరావృత్తిరహితస్థానముగు పరమపదమును బొందియున్నారని పండితమహాశయులు తెలియుదగియున్నది.

శ్లో॥ వేదాభ్యాసోఽన్వహం శక్త్యా మహాయజ్ఞక్రియా తథా
నాశయ త్యాశు పాపాని దేవానా మర్చనం తథా.
—పరాశరస్మృతౌ-కూర్మపురాణే.

అని వేదాధ్యయనాధికారు లయినవారు ప్రతినిత్యము శక్తికొలది పాపహరణమునకై భగవద్దేవతార్చనమును జేయవలసినదే యని తెలియవలెను.

శ్లో॥ యేఽర్చయంతి సదా విష్ణుం శంఖచక్రగదాధరం
సర్వపాపవినిర్ముక్తా బ్రహ్మాణం ప్రవిశంతి తే.
—పరాశరస్మృతౌ-విష్ణుధర్మోత్తరఖండే.

అను ప్రమాణానుసారము శంఖచక్రగదాధరు డగు శ్రీమహావిష్ణువు నెవరు సదా పూజించుచుందురో వారు సర్వపాపవినిర్ముక్తులై యాపరబ్రహ్మమును బొందుదు రని తెలియవలెను.

శ్లో॥ ప్రతిమాం కారయే త్పూర్వం సాధక స్సుసమాహితః
సురూపాం లక్షణోపేతాం దేవదేవస్య శార్ఙ్గిణః
తస్యాం జీవం సమారోప్య సమారాధ్య న సీదతి.
పురుషోత్తమ సంహితాయాం-పంచమాధ్యాయే.

అను ప్రమాణానుసారము శ్రీమన్నారాయణ పరబ్రహ్మ మును పొందుటకు శాస్త్రులుక్షణయుక్తమగు విగ్రహమును ప్రతిష్ఠించి సాత్వతాగమోక్తవిధానముగా బ్రాహ్మణులైనవారికి విగ్రహారాధనము చేయవలసినదిగా దేవతార్చనము విధించియున్నదని శాస్త్రిగారు తెలియవలెను.

శ్లో॥ కోమలైస్తులసీపత్రైః స్రగ్భిర్దైర్గ్వాజరిసంయుతైః
అర్చయేన్మంత్రరత్నేన శతమష్టోత్తరం హరిం
మధ్వాజ్యగుడసంయుక్తం పాయసాన్నం నివేదయేత్.
—పరాశరస్మృత్యుత్తరఖండే.

అనియును—

శ్లో॥ రక్తైస్సరోరుహైర్దేవ మర్చయేన్మధుసూదనం
దధ్యన్నం పానకం శీతం హృద్యైశ్చూతఫలైస్సహ.

అనియును—

శ్లో॥ యథాదేహే తథాదేవే న్యాసం కృత్వా విధానతః.
—పరాశరస్మృతౌ - ఆచారకాండే.

అనియట్టి ప్రాణప్రతిష్ఠాయుత భగవద్విగ్రహమును తులసీదళ తామరపద్మ చూతఫల దధ్యన్న పాయసాన్న పానకములతో న్యాసవిధిగా నర్చింపవలసిన దని తెలియవలెను

శ్లో॥ ఏవం న్యాసవిధిం కృత్వా పశ్చాద్యాగం సమాచరేత్
స్నానే వస్త్రేచ నైవేద్యే దద్యాదాచమనం తథా
హుత్వా షోడశభిర్మంత్రైః షోడశాన్నస్య చాహుతీః.

అని న్యాసవిధిగా షోడశోపచారములతో భగవద్యాగమును జేయవలయు నని తెలియవలెను.

శ్లో॥ నిత్యమభ్యర్చయేద్దేవం పురాణపురుషోత్తమం
అప్సు వాగ్న్యౌ తథార్చాయాం సహస్రా హృది తథా గురౌ
త్రికాల మర్చయేద్దేవం ప్రతిమాసు విశేషతః
స్నానకాలే జలే సమ్యక్పూజయే జ్జలశాయినం.
—పరాశరస్మృత్యుత్తరఖండే—సప్తదశాధ్యాయే.

అనియును—

యజ్ఞరూపం స్మరే ద్విష్ణు మగ్నిమండలమధ్యగం
సర్వయజ్ఞమయం దేవం వేదాంగోపాంగశోభితం
లక్ష్మ్యాసహ సుఖాసీనం ధ్యాయే ద్యజ్ఞపతిం హరిం.

అను ప్రమాణానుసారము సర్వయజ్ఞమూర్తి యగు శ్రీమన్నారాయణభగవదర్చావిగ్రహమును ప్రతినిత్యము త్రికాలముల యందును షోడశోపచారమంత్రంబులచే నర్చింపవలయు నని శాస్త్రిగారు తెలియువలెను.

శ్లో॥ ఇష్టాన్ భోగాన్ హి వో దేవా దాస్యంతే యజ్ఞభావితాః.
—పరాశరస్మృతౌ.

అని యజ్ఞభావితు లగు దేవత లిష్టభోగముల నిత్తు రని శాస్త్రిగారు తెలియువలెను.

శ్లో॥ సుశుద్ధై ర్యజమానైశ్చ ఋత్విగ్భిశ్చ తథావిధైః
శుద్ధద్రవ్యోపకరణై ర్యష్టవ్య మితి నిశ్చయః
తథాకృతేషు యజ్ఞేషు దేవానాం తోషణం భవేత్
తుష్టేషు దేవసంఘేషు యజ్ఞే యజ్ఞఫలం లభేత్
దేవా స్సంతోషితా యజ్ఞే లోకాన్ త్సంవర్ధయంత్యుత
ఉభయో ర్లోకయో ర్దేవి భూతి ర్యజ్ఞైః ప్రదృశ్యతే.
—పరాశరస్మృతౌ, భారతే - అనుశాసనికపర్వణిచ.

అను ప్రమాణానుసారమిష్టభోగార్థ మేర్పడిన బ్రహ్మయజ్ఞంబైన భగవన్నిత్యదేవతార్చనము దేవయజ్ఞము ఋత్విగాచార్య శుద్ధద్రవ్యోపకరణ శుద్ధయజమానులచే లభించి ఉభయలోకములయందును ఐశ్వర్యకరమయిన భూతయజ్ఞమే నని తెలియువలెను.

శ్లో॥ యజ్ఞేన లోకా విమలా విభాంతి యజ్ఞేన దేవా అమృతత్వ
మాప్నువన్
యజ్ఞేన పాపై ర్బహుభి ర్విముక్తః ప్రాప్నోతి లోకా నమరస్య
విష్ణోః
నాస్త్యయజ్ఞ స్య లోకో వై నాయజ్ఞో విందతే శుభం.
—పరాశరస్మృతౌ-ఆచారకాండే.

అను ప్రమాణానుసార ముభయలోకభూతికర మైన భగవ ద్యజ్ఞముచే దేవత లమృతత్వమును బొందుదురనియు భగవద్యజ్ఞము వలన సర్వపాపవినిర్ముక్తులై విష్ణులోకమును పొందుదు రనియు నట్టి భగవద్యజ్ఞము కాని యజ్ఞములవలన బుణ్యశుభములు లేవనియు దెలియ వలెను.

శ్లో॥ యో మోహా దథవాలస్యా దకృత్వా దేవతార్చనం
భుంక్తే స యాతి నరకం సూకరేష్వపి జాయతే.
—పరాశరస్మృతౌ-కూర్మపురాణే.

అని మోహంబునగాని ఆలస్యంబునగాని దేవతార్చనంబు చేయక యెవండు భుజించునో వాడు రౌరవాదిఘోరనరకప్రాప్తుడై పందికడుపున బుట్టు నని శాస్త్రిగారు తెలియువలెను.

శ్లో॥ త్యాజ్యం దోషవ దిత్యేకే కర్మ ప్రాహు ర్మనీషిణః
యజ్ఞదానతపఃకర్మ న త్యాజ్య మితిచాపరే
నిశ్చయం శృణు మే తత్ర త్యాగే భరతసత్తమ.
—శ్రీ గీతాయాం.

అని సర్వకర్మారాధ్యస్వరూప మగు శ్రీమహావిష్ణుపరమగు యజ్ఞ, దాన, తపః, కర్మలు గానటువంటి భగవదితరకర్మలు త్యాజ్య ములయిన వని తెలియువలెను.

శ్లో॥ తస్మా ద్దాస్యతయా ధర్మ మచ్యుతప్రీతయే సదా
కర్తృత్వఫలసంగిత్వత్యాగపూర్వం సమాచరేత్.
—హారీతః.

అనుప్రమాణానుసారము కర్తృత్వఫలసంగత్యాగపూర్వ కముగా భగవద్దాస్యధర్మము అచ్యుతప్రీతిగా సదా ఆచరింపవలసి నదే నని తెలియువలెను.

శ్లో॥ శుచి ర్విప్ర స్సదా కుర్యా ద్విష్ణుదేవాలయాదిషు
శ్రియాసహైవ తద్విష్ణుపూజా మాగమసాత్వికైః.
—ధర్మసారే - పరాశరసంహితాయాం.

అని శ్రోత్రియు డైన బ్రాహ్మణుడు లక్ష్మీసహచరుడైన శ్రీమహావిష్ణువును సాత్వికాగమముచే విష్ణుదేవాలయములయందే విధిగా పూజింపవలయునని దేవతార్చనము బ్రాహ్మణునికి పరబ్రహ్మ ప్రాప్తికొరకు విధిగా చెప్పి యున్న దని శాస్త్రిగారు తెలియవలెను.

శ్లో॥ నిష్పీడ్య స్నానవస్త్రం వై ద్విరాచ మ్యార్చయే ద్ధరిం
న విష్ణ్వారాధనా త్పుణ్యం విద్యతే కర్మ వైదికం
తస్మా దనాదిమధ్యాంతం నిత్య మారాధయే ద్ధరిం.
—ధర్మసారే - వ్యాసః.

అని షట్కర్మాధికారి యగు శుద్ధశ్రోత్రియ బ్రాహ్మణుడు నిత్య నిరవద్య నిరవధిక నిరతిశయానంద స్వరూపుడైన శ్రీమహా విష్ణువును త్రికాలములయందును పుణ్యఫలప్రాప్తికొరకు ఆరాధింప వలసినదే నని శాస్త్రిగారు తెలియవలెను.

ఇట్లు భగవదర్చనము నిత్యవేదషట్కర్మల లోనిదై యుండగా నక్షత్రయాజక శ్రేష్ఠు లయిన శాస్త్రిగారు తమనిత్యనైమిత్తికంబుల దేవతార్చనము చేయక యెట్లు కర్మపూర్తి గావించుచున్నారో ఆస్తిక పాఠకమహాశయు లాలోచింపవలసినధర్మసందేహ మైయున్నది. మరియు బ్రాహ్మణు లైనవారు భగవన్నివేదితమైన యన్న మునే నివేదించి పంచాహుతిరూపముగా పుచ్చుకొనవలయునని ధర్మశాస్త్రములయందు విధించియుండగా అట్లు భగవదారాధ నమునుచేసియే భూతయజ్ఞమును చేయు శ్రీపాంచరాత్రస్వాములు అర్చకు లని వీరికి గల మస్సంకోచమును బాపుకొందురుగాక.

అట్లు భగవన్నివేదితమైన పరిశుద్ధాన్నముగాక శాస్త్రిగారి ప్రాణాగ్నిహోత్రన కేయన్నమును నివేదించి అంతఃకరణశుద్ధి గావిం చుచున్నారో విద్వజ్జనశిఖామణు లాలోచింపవలసినధర్మసందేహ మై యున్నది. మరియు భగవద్ధర్మమైన శ్రీపాంచరాత్రాగమభగవద్దేవతా ర్చనము వేదయుక్తధర్మమే ననియును.

శ్లో॥ వేదోఽఖిలో ధర్మమూలం స్మృతిశీలేచ తద్విదాం
ఆచారశ్చైవ సాధూనా మాత్మన స్తుష్టి రేవచ.

వేదో ధర్మమూలం
తద్విదాంచ స్మృతిశీలే

అను ప్రమాణానుసారము స్మృతులయందు చెప్పబడిన సదాచార ధర్మమును సాధువు లయినవా రాత్మతుష్టిగా నాచరింతు రనియును శ్రుతిస్మృతీతిహాససంహితలచే ప్రదర్శింపబడిన దేవతార్చన బ్రాహ్మణు లయినవారికి షట్కర్మములలో చేరినదే యని నక్షత్రియాజకశ్రేష్ఠు లయిన శాస్త్రిగారికి ప్రబలప్రమాణములచే దేవతార్చన విధిని దెలియబరచి, అర్చకవిషయసందేహనివృత్తికొరకు తగిన బహువిధ ప్రమాణముల ప్రదర్శించెదను.

ఇది శ్రీపాంచరాత్రాగమ దివ్యశాస్త్ర విషయప్రదర్శనియందు
దేవతార్చనా విషయమును సప్తమ ప్రకరణము

సంపూర్ణము.



శ్రీ రస్తు.

# శ్రీపాంచరాత్రాగమ దివ్యశాస్త్ర విషయప్రదర్శని

అను

# తాంబూలదుర్వాదఖండనము

## అష్టమ ప్రకరణము.

### అర్చకస్వరూప దేవలకత్వదోషనివృత్తి విషయము.

ఆస్తిక పాఠకమహాశయులారా! శ్రీపాంచరాత్రాచార్య స్వాములను నర్చకులనియును వీరికి దేవలకత్వదోషము కలదనియును మన పూర్వపక్షులగు శాస్త్రిగారికి గల సందేహనివృత్తి యగునట్లు ముందుగ నర్చకోత్పత్తిస్వరూపమును గనబరచి యనంతరము తదర్చక దేవలకత్వ దోషనివృత్తి గల ప్రమాణములను ప్రదర్శించెదను.

పరమపద మగు నిత్యవిభూతియందు వేంచేసియున్న శ్రీమన్నారాయణుండు చేతనసంరక్షణార్థంబుగ తమస్వరూపంబును నాలు విధంబుల విభజించి ఆచార్యరూపులై భగవదుపాసనారాధనాదిధర్మమును శ్రీఅమ్మవార్లకు ద్వయానుసంధానరూపముగా నుపదేశించిరి.

శ్రీ ప్రశ్నానంతరం భగవా నువాచ—

శ్లో॥ మమ స్వరూపం సర్వస్మా త్పరస్య జగదీశితుః
షడ్విధం పరిపూర్ణం త త్సేనేశ పరిపఠ్యతే
పరత్వం వ్యూహవిభవ మంతర్యామిత్వ మేవచ
అర్చాచార్యావతారౌ ద్వౌ షాడ్విధ్యం మే ప్రకీర్తితమ్.

—శ్రీప్రశ్నసంహితాయామ్.

అనియును—

శ్లో॥ ఏకః పర స్తతో వ్యూహ మంతర్యామీ తృతీయకం
తురీయో విభవశ్చైవ అర్చారూపశ్చ పంచమం

అర్చక శ్చేతి...............................
ఆచార్య శ్చేతి మన్మూర్తిమూలమూర్తే రజాయత
తస్మాత్సర్వప్రయత్నేన అర్చకో...............
ఆచార్యో మంత్రమూర్తిమాన్...............

—పరమపురుషసంహితాయాం.

అనియును—

శ్లో॥ అర్చక స్స హరి స్సాక్షా చ్చరరూపీ న సంశయః
ఇతిమత్వా మహాప్రాజ్ఞం సమారోప్యతు యానకే.

—పురుషోత్తమసంహితాయాం.

అనుప్రమాణములచే నర్చకు లయిన శ్రీపాంచరాత్రస్వాములు సాక్షాద్భగవత్స్వరూపు లనియు భగవద్దీక్షాసంస్కార పంచకాల పరాయణ పరమైకాంత మహాభాగవతోత్తము లనియును, విశిష్టాద్వైతసిద్ధాంతనిష్ఠు లనియును, స్వయమాచార్యాధికారస్వరూపు లనియును శాస్త్రిగారు బాగుగ దెలియవలెను.

మరియు—

శ్లో॥ లబ్ధాధికారో దేవస్య ధ్యానార్చనజపాదిషు.

—ధర్మసారే.

అనగా ప్రోక్షప్రోక్షకత్వాదిభగవద్దీక్షాసంస్కారమంత్రమంత్రార్థలబ్ధాధికారులైన శ్రీపాంచరాత్రస్వాములే భగవద్ధ్యానార్చనార్హు లని తెలియవలెను.

శ్లో॥ నోపచర్యాహరే స్థానే సన్నిధాతు విశేషతః
ఏకాంతినో మహాభాగా విష్ణు మేవ సమాశ్రితాః.

—ధర్మసారసముచ్చయే - వారాహే.

అని భగవత్సాన్నిధ్యము కల విష్ణుదేవాలయములయందు భగవన్నిష్ఠానుష్ఠానోపచర్యాదుల జేయుచు నాశ్రితులైయుండువారే పరమైకాంతమహాభాగవత శ్రీపాంచరాత్రస్వాము లని శాస్త్రిగారు తెలియవలెను.

శ్లో॥ శ్రోత్రియై ర్భగవద్భక్తై శ్చతుర్భి ర్బ్రాహ్మణై స్సహ
శ్రోత్రియో విష్ణుభక్తశ్చ గృహస్థ శ్శాస్త్రవిత్తమః
చక్రలింగధరో విప్రః ప్రతిష్ఠాం కర్తు మర్హతి.
—ధర్మసారసముచ్చయే - పరాశరసంహితాయాం.

అను ప్రమాణానుసారము విష్ణుభక్తులయిన పాంచరాత్ర మహాభాగవత బ్రాహ్మణోత్తములే శ్రోత్రియులైన పరమవైదికులనియు, గృహస్థాశ్రమవాసు లనియు, భగవచ్ఛాస్త్రవేత్త లనియు, భగవచ్చిహ్నాంకితదీక్షా పరులనియు, విష్ణ్వాలయాది ప్రతిష్ఠాంతకర్మార్హులనియును దెలియవలెను.

శ్లో॥ భగవంతం తథా విప్రాన్ పంచకాలపరాయణాన్
భగవన్మందిరం చైవ పుణ్యతీర్థాని సర్వదా
స్వయం వ్యక్తస్థలాదీనాం న్యాశినో న్యర్చకస్య చ.
— ధర్మసారసముచ్చయే - నారదీయే.

అని భగవద్దీక్షా పంచకాలపరాయణు లయిన భగవత్స్వరూపులగు పాంచరాత్రస్వాములు భగవదర్చకులై విష్ణుదేవాలయములయిన పుణ్యతీర్థములయందు సర్వదా ప్రకాశించుచుందు రని తెలియవలెను.

శ్లో॥ అవైష్ణవేన విప్రేణ స్థాపితే మధుసూదనే
తద్రాష్ట్రం భూపతి ర్వాపి వినాశ ముపయాస్యతి
కుర్వీత వాసుదేవేష్టిం తత్పాపప్రశమాయతు
మహాభాగవతేనైవ పునస్సంస్కార మాచరేత్.
—ధర్మసారే - హారీతః

అనుప్రమాణానుసార మవైష్ణవులగు బ్రాహ్మణులచే ప్రతిష్ఠింపబడిన భగవద్విగ్రహసేవార్చనాదులచే తద్రాష్ట్రమును, రాష్ట్రాధిపతియైన రాజును వినాశఫలమును బొందుదురు, యును నట్టి పాతకమును బోగొట్టుకొనుటకై మహాభాగవత బ్రాహ్మణోత్తములచే పునస్సంస్కార మాచరించిన దత్పాపప్రశమనం బగునని తెలియుచున్నందున పాంచరాత్రాచార్యులే భగవదర్చనార్హులని తెలియవలెను.

శ్లో॥ దీక్షిత స్సకలం కుర్యా ద్విష్ణుయాగాదిపూజనం
అదీక్షిత శ్చతుర్వేదీ దేవస్పర్శంచ వర్జయేత్.
—శ్రీ పాంచరాత్రాగమాంతర్గత-అనంతాఖ్యసంహితాయాం.

అనుప్రమాణముచే పంచసంస్కారదీక్షాపరులే భగవదర్చనార్హులనియు నదీక్షితు లగువిప్రులు చతుర్వేదాధ్యయనపరులైనను నట్టిపూజార్హులు కారని శాస్త్రిగారు సందేహనివృత్తిగా దెలియుదగియున్నది. మరియు—

శ్లో॥ మద్భక్తో వైష్ణవో విప్రః పంచసంస్కారదీక్షితః
మచ్ఛేషత్వపరిజ్ఞానీ మమ పూజాపరాయణః
మంత్రరత్నోక్తమార్గేణ మహావిశ్వాసపూర్వకం
ఆత్మార్థంవా పరార్థంవా మమపూజాపర స్సదా
నచ దేవలకో జ్ఞేయ స్సదా పూజాం సమాచరేత్.
—విష్ణుతత్త్వే.

అనియును—

శ్లో॥ యేన కేనప్రకారేణ విష్ణో రారాధనం పరం
తస్మా ద్దేవలకత్వంతు న విష్ణువిషయం క్వచిత్.
—ప్రపన్న ధర్మసారసముచ్చయే.

అనియును—

శ్లో॥ దీక్షితో భగవద్భక్త స్సమయాచారతత్పరః
గురుభక్తివిశేషజ్ఞో న్యాసవిద్యావిశారదః
విష్ణో రారాధనరత స్తత్ప్రసాదేన జీవకః
సదా విష్ణుం ప్రపూజ్యాథ నాసౌ దేవలకో భవేత్.
—అనిరుద్ధసంహితాయాం.

అనియును—

శ్లో॥ వైష్ణవో విష్ణుసంబంధీ సదా విష్ణుం ప్రపూజయేత్
నభవే ద్దేవలకత్వంతు వైష్ణవస్య మహాత్మనః.
—విష్ణుధర్మే.

అనియును—

శ్లో॥ దీక్షితాః పంచసంస్కారైః పంచకాలపరాయణాః
ఆత్మార్థం వా పరార్థంవా నిత్యం హరి ముపాసతే
నచ దేవలకా జ్ఞేయా స్సర్వశాస్త్రేషు నిశ్చయః.
—ఖగప్రశ్న సంహితాయాం.

అనియును—

శ్లో॥ వైష్ణవో విష్ణుయజనం నిత్యమేవం సమాచరేత్
నచ దేవలకో జ్ఞేయ స్సర్వశాస్త్రేషు నిశ్చయః.
అనియును— —శ్రీధరసంహితాయాం.

శ్లో॥ మహాభాగవత స్త్వేనం పూజయే త్సతతం హరిం
మంత్రరత్నవిధానేన మహావిశ్వాసపూర్వకం
యోఽర్చకో వైష్ణవశ్రేష్ఠో న దేవలకనామకః.
అనియును— —హారీతస్మృతౌ:

శ్లో॥ దీక్షితైః పంచసంస్కారై రర్థపంచకతత్త్వవిత్
పంచకాలపరో నిత్యం వైష్ణవో మంత్రవిత్తమః
పౌరుషేణ విధానేన శ్రీమదష్టాక్షరేణవా
మంత్రద్వయేన వా కుర్యా త్త్రికాలం పూజనం హరేః
శేషశేషిత్వసంబంధజ్ఞానభక్తిసమన్వితః
ఆత్మార్థంవా పరార్థంవా నచ దేవలకో భవేత్.
అనియును— —పరాశరసంహితాయాం.

శ్లో॥ నాపహృత్య హరే ర్ద్రవ్యం గ్రామార్చనపరో భవేత్
భక్త్యా సంపూజ్య దేవేశం నాసౌ దేవలక స్స్మృతః.
అనియును— —ధర్మసారే.

శ్లో॥ భక్త్యా యో హ్యర్చయే ద్దేవం గ్రామార్చాం హరి మవ్యయం
ప్రసాదతీర్థసేవీచ నాసౌ దేవలకో భవేత్.
—ధర్మసారే, అనంతాఖ్యసంహితాయాం.

అనియును—

శ్లో॥ ప్రీత్యర్థం వాసుదేవస్య కర్మజ్ఞానాదికం నరః
స విప్రః పరమైకాంతీ మహాభాగవత స్స్మృతః.
అనియును— —ధర్మసారే.

శ్లో॥ ప్రపన్నో వా యది శ్రేష్ఠ ఏతదుక్తవిధానతః
నిషేకబ్రహ్మమేధాంతం పంచసంస్కారపూర్వకం
ప్రపన్నవృత్తిమాచారం స్వయం వ్యక్తస్థలాదిషు
అగ్రహారే పట్టణే వా గ్రహాగ్రామార్చనాదిషు
ఆచరేద్యోఽథవా విప్ర స్స గురు ర్వైష్ణవ శ్శుచిః
ప్రపన్నపరమైకాంతీ స ద్విజో బ్రాహ్మణోత్తమః
సత్యం సత్యం పునస్సత్య మిద మేవ చతుర్ముఖ.

—పరాశరసంహితాయాం- తృతీయోఽధ్యాయః.

అనియును—

శ్లో॥ న చ మంత్రోపజీవ స్స్యా న్న చాప్యర్చోపజీవకః
న హి వేదతభోజీ స్యా న్న చ నింద్యనివేదకః.

—భారద్వాజసంహితాయాం.

అనియును—

శ్లో॥ న్యస్తాశేషభర శ్శ్రీశే యస్తు దాస్యైకజీవనః
స ఏవ పరమైకాంతీ ద్వావేతౌ వైష్ణవౌ స్మృతౌ.

అనియును—

శ్లో॥ స ఏకాంత్యన్యముఖో హరిం సర్వేశ్వరం పరం
య స్సమాశ్రయతే కించి త్ఫల మప్యర్థయ న్నరః.

అను బహువిధధర్మశాస్త్రప్రమాణములచే స్వార్థ పరార్థయజనాధికారులైన శ్రీ పాంచరాత్ర భగవదర్చక స్వాములకు విష్ణ్వారాధనమువలన దేవలకత్వదోష మణుమాత్రమైనను లేదనియు, స్వమతధర్మమేనని శాస్త్రిగారికి తేటతెల్లముగా తెలియజేసి, భగవత్సేవా ప్రసాద తీర్థ స్వీకారమహిమలను బహుప్రమాణవచనములచే బ్రతిపాదించెదను.

ఇది శ్రీ పాంచరాత్రాగమ దివ్యశాస్త్ర విషయప్రదర్శనియందు
అర్చకస్వరూప దేవలకత్వదోషవృత్తి కథనమను
అష్టమప్రకరణము సంపూర్ణము.

---

శ్రీ రస్తు.

# శ్రీపాంచరాత్రాగమదివ్యశాస్త్రవిషయప్రదర్శని

అను

# తాంబూలదుర్వాదఖండనము.



## నవమ ప్రకరణము.



### శ్రీ భగవత్సేవార్థ ప్రసాద స్వీకారమహిమా విశేష విషయము.

శ్లో॥ విష్ణ్వాలయ సమీపస్థాన్ విష్ణుసేవార్థ మాగతాన్
అంత్యజాన్ పతితా న్వాపి స్పృష్ట్వా న స్నాన మాచరేత్.
—ప్రపన్నధర్మ సారసముచ్చయే—పాద్మే.

అనియును—

శ్లో॥ విష్ణ్వాలయాంతిక స్థానం తత్సేవార్థ ముపేయుషాం
స్పర్శ స్సర్వాపగాస్నానా దతిరిక్తతమో మతః.

అనియును—

శ్లో॥ ఉత్సవే వాసుదేవస్య యః స్నాతి స్పర్శశంకయా
స్వర్గస్థాః పితర స్తస్య పతంతి నరకే క్షణాత్.

అను ప్రమాణములచే విష్ణుసేవావిశేషమును తెలియదగి యున్నది.

శ్లో॥ విష్ణో ర్నివేద్యకం శుద్ధం మునిభి ర్భోజ్య మాచ్యతే
అన్య న్నివేద్య నిర్మాల్యం భుక్త్వా చాంద్రాయణం చరేత్.
—ధర్మసారే యామునాగమే బ్రహ్మపురాణే.

అనుటచే విష్ణు నివేదితాన్నమునే భుజించవలసినదనియును, నన్యదేవతా నివేదితాన్నమును భుజించినవారు చాంద్రాయణాది ప్రాయశ్చిత్తము నాచరింపవలయునని తెలియవలెను.

శ్లో॥ నిర్మాల్యబుద్ధ్యా దేవీయం పావనం దూషయంతి యే
తే యాంతి నరకం మూఢా స్తత్ప్రభావాపలాపినః.
—ఈశ్వరసంహితాయాం.

అట్టిపావనమైన విష్ణుప్రసాదమును నిర్మాల్యబుద్ధిగా దూషించెడివారు తత్ప్రసాదప్రభావ మెఱుగక మూఢులై నరకప్రాప్తులగుదురని తెలియవలెను.

శ్లో॥ శంభో ర్నివేదితం భక్తం తీర్థం శాక మేవ వా
విప్రః కదా న భుంజీయా ద్భుక్త్వా తప్తం సమాచరేత్.
—హేమాద్రిప్రాయశ్చిత్తకాండే.

అని శివనివేదితాన్నశాకాదుల భుజించిన, బ్రాహ్మణులకు ప్రాయశ్చిత్తరూపముగ తప్తమును చేయవలయునని తెలియవలెను.

శ్లో॥ దేవతాంతరనిర్మాల్యం శిష్టై రిష్టం విగర్హితం
ఇదంతు వైదికత్వేన సోమపాన వదిష్యతే.
—యామునాగమే.

అని యన్యదేవతానైవేద్య నిర్మాల్యములు శిష్టులైన వైదికులు గ్రహింపరని తెలియవలెను.

మఱియును—

శ్లో॥ నిరూపణేపి భగవ న్నిర్మాల్యమతిపావనం
సమస్తవైదికాచార్యవచనై రవశీయతే.

అను ప్రమాణానుసారము విష్ణుప్రసాదనిర్మాల్యములు పావనమైన వేయని వైదికాచార్యవచనములచే తెలియవలెను.

శ్లో॥ షట్కర్మాభిరతో నిత్యం దేవతాతిథిపూజకః
హుతశేషంతు భుంజానో బ్రాహ్మణో నావసీదతి.
—పరాశరస్మృతౌ - ఆచారకాండే.

అని సమస్తవైదికాచార్యులయినవారిచే కొనియాడబడిన విష్ణునివేదితాన్నమునే షట్కర్మనిరతులయిన బ్రాహ్మణులు భుజించవలయు నని తెలియవలెను.

శ్లో॥ హృది ధ్యాయన్ హరిం తస్మై సవేద్యాన్నం సమాహితః
మధ్యమానామికాంగుష్ఠైః గృహీత్వాన్న మిదం పునః
ప్రాణాయ చేత్యపానాయ వ్యానాయచ తతఃపరం
ఉదానాయ సమానాయ స్వాహేతి జుహుయా త్క్రమాత్
నను ప్రాణాగ్నిహోత్రస్య నైవేద్యం సాధనం కథం
నిరిష్టికా న శిష్టానా మిష్టం హోమాదిసాధనం
నచ ద్రవ్యాంతరాక్షేపో హోమహోమే త్యవకల్ప్యతే
రాగతః ప్రాప్త మేవాన్నం యత స్తేనోపజీవ్యతే
నాపి భుక్త్యంతరాక్షేపో నైవేద్యే యోపపాద్యతే
సాయం ప్రాత ర్ద్విజాతీనా మశనం శ్రుతిచోదితం
నాంతరా భోజనం కుర్యా దితి తత్ప్రతిషేధనాత్
నైతద్దోషో యతః ప్రాణప్రభృతి ర్దేవతాగణః
గుణభూత శ్శ్రుతో విష్ణో ర్విష్ణుపారిష దేశవత్.

—యామునాగమే - మహాభారతే.

అనుసల్లు నిత్యమును బ్రాహ్మణు లయినవారు భగవన్నివేదితాన్నమునే ప్రాణాగ్నిహోత్రమను నైవేద్యాశనతంత్రముచే నివేదించి భుజింపవలయునని, శాస్త్రీగారు భగవత్ప్రసాదమహిమను తెలియవలెను.

మఱియును—

శ్లో॥ యథా వా హోతు రుచ్ఛిష్ట ఏవం సోమరసో ధ్వరే
అధ్వర్యాద్యై ర్విశుద్ధై స్సాన్య దేవ మత్ర భవిష్యతి.

అపియును—

శ్లో॥ భోజ్యాభోజ్యవ్యవస్థాయాం శాస్త్రమేవ నిబంధనం
తచ్చే ద్భోజ్య మిదం బ్రూతే కిం వయం విదధీమహి
యథానుష్ఠానతంత్రత్వం నిత్యకామ్యాగ్నిహోత్రయోః
ఏవం ప్రాణాగ్నిహోత్రేఽపి నైవేద్యాశనతంత్రతా.

అనునట్లు భగవన్నివేదితాన్నమునే ప్రాణాగ్నిహోత్రమున కాహుతి చేసి భూతయజ్ఞము నాచరింపవలయు నని శాస్త్రిగారు తెలియవలెను.

శ్లో॥ దేవ్య స్తు హుతద న్నాచ్ఛేషా ద్భూతబలిం హరేత్
భూతయజ్ఞ స్స వై ప్రోక్తో భూతిద స్సర్వదేహినాం.
—(పరాశరస్మృతౌ—ఆచారకాండే; (కూర్మపురాణే.)

అట్లు చేయుబడిన భూతయజ్ఞము సర్వదేహులకు భూతికర మైనదే నని తెలియవలెను.

శ్లో॥ భూతాని సర్వాణి తదన్నమేత
దహం చ విష్ణు ర్నతతో న్య దస్తి.
—(పరాశరస్మృతౌ—విష్ణుపురాణే.)

అట్లు భూతయజ్ఞద్రవ్యమైన యన్నమే సర్వభూతమయ పరమాత్మస్వరూప మని తెలియునది.

శ్లో॥ దేవా మనుష్యాః పశవో వయాంసి
సిద్ధాశ్చ యక్షోరగదైత్యసంఘాః
ప్రేతాః పిశాచా స్తరవ స్సమస్తా
యే చాన్న మిచ్ఛంతి మయా ప్రదత్తం.
—(పరాశరస్మృతౌ.)

అట్టి భగవత్స్వరూపమయిన యన్నమును భూతయజ్ఞ పూర్తద్రవ్య మగుటచేత, దేవతలు, మనుష్యులు, పశువులు, సిద్ధులు, యక్షులు, ఉరగులు, రాక్షసులు, ప్రేతములు, పిశాచములు, భగవన్నివేదితాన్నమునే కోరుదురని శాస్త్రిగారు భగవత్ప్రసాదమహిమను తెలియవలెను.

శ్లో॥ హృది రూపం ముఖే నామ నైవేద్య ముదరే హరేః
పాదోదకంచ నిర్మాల్యం యస్య మూర్ధ్ని స వైష్ణవః.
—సచ్చరిత్రరక్షాయాం.

ఇట్టి భగవద్రూప నామనైవేద్యపాదోదకనిర్మాల్యముల నెవరు ధరింతురో వారే వైష్ణవు లని తెలియవలెను.

శ్లో॥ దుర్లభో భగవద్భక్తో లోకేస్మిన్పురుష స్సత!
తత్రాపి దుర్లభతరో భావో వై యస్య తత్త్వతః
పాదోదకం ప్రతిశుభ స్సిద్ధాన్నంచ నివేదితే
ప్రగాదికే చోపభుంక్తే హ్యుపభోగార్థ మేవ చ
అతశ్చ భావహీనానా మభక్తానాంచ షణ్ముఖ!
—యామునాగమే - ఈశ్వరసంహితాయాం.

ఇట్టి వైష్ణవధర్మంబైన భగవత్ప్రసాదతీర్థనిర్మాల్యచందనాదుల నుపభోగములుగా ననుభవించి యుజ్జీవించు శ్రీపాంచరాత్ర భగవత్సృతులగు విష్ణుభక్తులు లోకములో లభించుట దుర్లభ మనియును, అట్టి ప్రసాదనిర్మాల్యాదులు భక్తుల కుపభోగార్థమైనవి కాను భావహీనులు అభక్తులనియు శాస్త్రిగారు తెలియవలెను.

శ్లో॥ అకృత్వా దేవపూజాంచ మహాయజ్ఞాన్ ద్విజోత్తమ!
భుంజీత చే త్స మూఢాత్మా తిర్యగ్యోనిం నిగచ్ఛతి.
—పరాశరస్మృతౌ.

అని భగవదర్చనము చేయక యితరాన్నమును భుజించినవారలు తిర్యగ్యోనులయందు బుట్టవలసిన యధోగతి గల్గుననియు, అట్టివారే మూఢజనులనియు శాస్త్రిగారు తెలియవలెను.

శ్లో॥ శ్రీపతి స్సర్వదోపాస్యో భోగమోక్షేచ్ఛుభి ర్జనైః
అన్యే బ్రహ్మాదయో దేవా నోపాస్యాస్తు ముముక్షుభిః
మహాభాగవతా స్సేవ్యా స్సచ్ఛాస్త్రం తదుదీరితం
ఇతి విజ్ఞాయ తత్త్వార్థం సదాచార్యోపదేశతః
శుష్కతార్కిక చార్వాక నాస్తికప్రముఖ ర్జనైః
అభేద్యా సుదృఢా సత్యం బుద్ధి స్సద్భోదితా బుధైః.
—ధర్మసారే.

అనునట్లు భగవద్దేవతార్చనముచేసి యర్చకులై భగవత్ప్రసాదమును భుజింపక నక్షత్రయాజిగా రెట్లు జీవన్మృతులుగా నున్నారో, ఇట్టి మోక్షఫలప్రదంబైన భగవదర్చనమును శ్రీ పాంచరాత్ర

శాస్త్రముచే సదాచారోపదేశముఖంబున నక్షత్రయాజిగారు తెలిసికొందురుగాక.

ఇది శ్రీపాంచరాత్రాగమ దివ్యశాస్త్రవిషయ ప్రదర్శినియందు
భగవత్సేవాతీర్థప్రసాద స్వీకార మహిమాది
విశేషవిషయమును నవమప్రకరణము
సంపూర్ణము.

---

శ్రీరస్తు.

# శ్రీపాంచరాత్రాగమదివ్యశాస్త్రవిషయప్రదర్శిని

అను

# తాంబూలదుర్వాదఖండనము.

## దశమప్రకరణము.

### దశవిధబ్రాహ్మణ్య, వైదికాచార విషయము.

ఆస్తికమహాశయులా! రామనశాస్త్రిగారికి బ్రాహ్మణులననెటువంటివారో బ్రాహ్మణసముదాచారధర్మము లెట్లున్నవో, తెలియక పరమవైదిక స్వరూపులైన శ్రీపాంచరాత్రస్వాముల యెడ వీరికిఁగల సందేహనివృత్తిగా, దశవిధబ్రాహ్మణ్యమును, వైదిక సదాచార ధర్మమును, యాజకాది వృత్తిదోషములను, బాగుగ పూర్వపక్షులకు తెలియునట్లు బహు ప్రమాణములచే ప్రకటించుచున్నాను.

అందు దశవిధబ్రాహ్మణలక్షణం

శ్లో॥ దేవో మునిర్ద్విజో రాజా వైశ్య శ్శూద్రో బిడాలకః
పశు మ్లేచ్ఛశ్చ చండాలో దశవిధాః ప్రకీర్తితాః.

—ప్రపన్నధర్మసారసముచ్చయః.

అని వృత్తిభేదములచే బ్రాహ్మణులు పది విధములుగా యున్నారని శాస్త్రిగారు తెలియదగు ప్రమాణములు.

శ్లో॥ ఉంఛవృత్తి ర్మితాహార స్సంతుష్టో విజితేంద్రియః
వేదశాస్త్రార్థతత్వజ్ఞో దేవో విప్ర స్స ఉచ్యతే. 1

అనునట్టివారు దేవవిప్రులనిన్నీ—

శ్లో॥ ఫలమూలాశనో దాంతో తపస్వీ వేదశాస్త్రవిత్
కృత్యాకృత్యవిశేషజ్ఞో నత్యవాఙ్మునిరుచ్యతే. 2

అనునట్టివారు ముని బ్రాహ్మణులనిన్నీ—

శ్లో॥ షట్కర్మనిరతో నిత్యం దేవతాతిథిపూజకః
స్వాధ్యాయనిరత స్సాధు స్స విప్రో ద్విజ ఉచ్యతే.

అనునట్టివారు ద్విజబ్రాహ్మణులనిన్నీ— 3

శ్లో॥ ధనుర్వేదవిశేషజ్ఞో రాజసేవారతశ్చ సః
త్రికర్మకృ న్మహోత్సాహీ విప్రః క్షత్రియ ఉచ్యతే. 4

అనునట్టివారు రాజబ్రాహ్మణులనిన్నీ—

శ్లో॥ స్వర్ణరత్నవిశేషజ్ఞో గోపోషక తత్పరః
క్రియావిక్రియాతత్వజ్ఞ స్స విప్రో వైశ్య ఉచ్యతే. 5

అనునట్టి వృత్తిగలవారు వైశ్యబ్రాహ్మణులనిన్నీ—

శ్లో॥ కృషిసేవాధమాచారో ధాన్యసంగ్రహ తత్పరః
గోరక్షణ విపజ్ఞస్స విప్ర శ్శూద్ర ఉచ్యతే. 6

ఇట్టి వృత్తిగలవారు శూద్రబ్రాహ్మణులనిన్నీ,—

శ్లో॥ యత్ర కుత్ర ప్రతిగ్రాహీ నిత్యం బ్రాహ్మణతత్పరః
స్వకార్య ముద్దిశ్య సదా స బిడాలక ఉచ్యతే. 7

ఇట్టి వృత్తిగలవారు బిడాలక బ్రాహ్మణులనిన్నీ,—

శ్లో॥ గమ్యాగమ్యం న జానాతి స్త్రియం యో శౌచనిర్గుణః
కృత్యాకృత్యపరిభ్రాంత స్స విప్రః పశురుచ్యతే. 8

అను వృత్తిగలవారు పశుబ్రాహ్మణులనిన్నీ,—

శ్లో॥ వాపీకూపతటాకాది దేవాయతనభేదకః
విప్రవేదాపవాదీచ స విప్రో మ్లేచ్ఛ ఉచ్యతే. 9

ఇట్టి వృత్తిగలవాడు మ్లేచ్ఛబ్రాహ్మణుడనిన్నీ,—

శ్లో॥ శస్త్రధార్యస్త్రధారీచ ధనుర్ధారీ ధనాధిపః
తిర్యక్పుండ్రధరో విప్రస్స చండాలసమో భవేత్. 10

అను వృత్తిగలవాడు చండాల సమ బ్రాహ్మణుడనిన్ని—,

శ్లో॥ పరహింసారతః క్రూరః పరదారపరాయణః
పరద్రవ్యాభిలాషీచ స చండాలో హి విద్ధయః 11

ఇట్టివాడు చండాలబ్రాహ్మణుడనిన్ని,—

శాస్త్రిగారు దశవిధములుగా వృత్తిభేదములచే బ్రాహ్మణులున్నారని బాగుగ తెలియపరచెను— మరియు పరమవైదిక, శుద్ధవైదిక, మిశ్రవైదిక శైవలక్షణము లెట్లున్నవో, యాజకాది వృత్తిదోషము లెట్లున్నవో పరిశీలించెదను—

అందు శైవలక్షణము.

శ్లో॥ భస్మస్నానం త్రిపుండ్రంచ బిల్వం పంచాక్షరీజపః
లింగార్చనంతు తన్నామ సోమవారవ్రతం తథా
తత్ర శ్శివయోగసారం శాస్త్రం శైవాష్టకం మునే.

అనగా భస్మస్నాన త్రిపుండ్రధారణ పంచాక్షరీ జపలింగార్చన బిల్వపూజా సోమవార వ్రతములుగా శివయోగానుసారులై యుండువారు శైవులని తెలియవలెను—

శ్లో॥ ఆదిత్య మంబికాం విష్ణుం గణనాథం మహేశ్వరం
పూజయేత్పంచపూజ్యాశ్చ తత్తత్ఫలమవాప్నుయాత్.

—మిశ్రవైదికలక్షణం.

అన్ని దేవతలను కల్పనము చేసి పంచాయతన పూజచేయువారు మిశ్రవైదికు లనబడుదురని తెలియవలెను—

శ్లో॥ ఉపవీతం శిఖాబంధం పవిత్రం చోర్ధ్వపుండ్రకం
ధౌతవస్త్రద్వయంచైవ విప్రముద్రాః ప్రకీర్తితాః.

—శుద్ధవైదికలక్షణం.

అనిన్ని—

శ్లో॥ యజనం యాజనం దానం విశిష్టాచ్చ ప్రతిగ్రహః
అధ్యాపనం చాధ్యయనం విప్రకర్మ ప్రకీర్తితం

—స్మృతిరత్నాకరే - లింగభట్టీయే.

అని శుద్ధవైదిక లక్షణము లిట్లుండగా, పరమవైదిక లక్షణములగు శ్రీపాంచరాత్ర స్వాములయెడ పూజ్యులు గారను సందేహము సంపూర్తిగా పరిహారమగునట్లు పరమవైదికులను నెట్టివారో శాస్త్రి గారు తెలియదగిన ప్రమాణములను ప్రదర్శించెదను.

శ్లో॥ ప్రతప్తైర్భగవద్దివ్యాయుధైర్గాత్రేషు లాంఛనం
సతతంచ హరిక్షేత్రోద్భవమృత్స్నోర్ధ్వ పుండ్రకం
పద్మబీజమయీ మాలా తులసీదివ్యమాల్యకం
పవిత్రం చాథ కౌపీనం కటిసూత్రేణ మేఖలే
పంచాయుధాబ్జతార్క్ష్యాది లక్షణాభరణాదికం
వేద శాస్త్రానుల్బణా శ్రౌతీం సంప్రమృత్యుత్పుండ్రనాసనాం
ఇత్యేతైర్లక్షణైర్యుక్తా వైష్ణవా వీతకల్మషాః
ఆఖ్యయా ప్యపదేశైశ్చ లక్షణాని సతాం విదుః.

—పరమవైదిక లక్షణము.

అనగా కృతసంస్కార దీక్షాలక్షణ శంఖచక్రధర హరిక్షేత్రోద్భవ శ్వేతమృదూర్ధ్వ పుండ్రధారులై, పద్మబీజమయ తులసీమాలా పవిత్ర కౌపీన కటిసూత్రాది లక్ష్మీయుత దివ్యలక్షణ విరాజితులై, పంచాయుధ స్వరూప శంఖ, చక్ర, గదా, పద్మ, తార్క్ష్య లక్షణాభరణాది ధారకులై, మంత్ర మంత్రార్థ పంచాంగ ప్రవీణ పంచకాల భగవదారాధనానుష్ఠాతలై, ఆకారత్రయ తత్త్వ సంపన్నులై, శాంత శమదమాది సలక్షణ గుణ స్వరూపులై సర్వలోక పూజ్యులై, యుండువారు (శ్రీ) పాంచరాత్ర పరమవైదికాచార్యులుగా శాస్త్రి గారు తెలియదగియున్నది,—

శ్లో॥ పరమం వైదికం యత్తత్సాత్త్వికం పరికీర్తితం
రాజసం వైదికం ప్రోక్తం తామసం మిశ్రవైదికం.

—వైదికాశ్చ సత్త్వరజస్తమోభేదేన త్రివిధాః - ధర్మసారే - ఆదిత్యపురాణే.

అని గుణత్రయోపాసనా భేదముచే వైదికము మూడువిధములుగా యున్నదని తెలియదగియున్నది—

మరియు—

శ్లో॥ వైదికత్రియ మిత్యాహు రాద్యం పరమవైదికం
ద్వితీయం వైదికం ప్రోక్తం తృతీయం మిశ్రవైదికం.

అనుటచే మొదటిది పరమవైదికమని, రెండవది వైదికమని, మూడవది మిశ్రవైదికమని తెలియనగును.

శ్లో॥ రాజసం వైదికం ప్రోక్తం సాత్వతా పరమవైదికం
శైవంచ తామసం ప్రోక్తం త్రిభిః మిశ్రవైదికం
తమః పరస్తాత్పరమం పదం ప్రాప్నోతి వైష్ణవః
స్వర్గాదిబ్రహ్మలోకాంతం పదం ప్రాప్నోతి వైదికః
ఐహికం చాముష్మికంచ మోక్షమేతత్ఫలత్రయం
యదృచ్ఛయేన క్రమా దిచ్ఛ త్తద్భావం మిశ్రవైదికం
కైలాసనామ ఆధారంపదం ప్రాప్నోతి శైవభాక్.
—శ్రీపాంచరాత్రగమే.

అని రజోగుణోపాసకులగు వైదికులు స్వర్గాది బ్రహ్మలోకాంతపదమును పొందుదురనియు, తమోగుణోపాసకులగు మిశ్రవైదికులు ఐహికాముష్మిక మోక్షఫలత్రయములకు ఇచ్ఛానుగుణంబుగ క్రమంబున పొందుదురనియు, శైవులు కైలాసపదమును పొందుదురనియు, సత్వగుణోపాసకులగు పరమవైదికులు అంతతమస్సు కవ్వలనుండు విష్ణుపదమును పొందుదురనియు, శాస్త్రిగారు తెలియదగి యున్నది.

మరియు, అపూజ్యులయిన యాజకాది వృత్తిదోషు లెవరో తెలియపరచు ప్రమాణములను ప్రదర్శించెదను.

ఇది శ్రీ పాంచరాత్రగమ దివ్యశాస్త్ర విషయప్రదర్శనియందు
దశవిధ బ్రాహ్మణ వైదికాచార విషయములు అను
దశమప్రకరణము సంపూర్ణము.



శ్రీరస్తు.

# శ్రీ పాంచరాత్రాగమదివ్యశాస్త్రవిషయప్రదర్శని

అను

# తాంబూలదుర్వాదఖండనము.

## ఏకాదశప్రకరణము.

### దేవలకత్వయాజకాది వృత్తిదోషవిషయము.

శ్లో॥ కుండాశీ గోళకాశీచ తథైవ గ్రామయాజకాః
అయాజ్యయాజకశ్చైవ మహాపాతకినస్స్మృతాః
వ్రాత్యస్సంస్కారహీనశ్చ స్యాదవకీర్ణీ క్షతవ్రతః.

—ప్రపన్నధర్మసారసముచ్చయే — స్మృతిరత్నాకరే.

అను ప్రమాణముచే కుండాశులు గోళకాశులు గ్రామపురోహితులు, అవకీర్ణజాతీయులనగు వారద్వజులు, ఇట్టి యాజకాది సంస్కారహీనులు మహాపాతకులని తెలియదగియున్నది.

మరియును—

శ్లో॥ ఆహ్వాయకా దేవలకా నక్షత్రగ్రామయాజకాః
ఏతే బ్రాహ్మణచండాలా మహాపథికపంచమాః.

—యామునాగమే.

దేవలకులనే వారును, నక్షత్రయాజకులును, గ్రామయాజకులును, ఇట్టి వృత్తిదోషులగు బ్రాహ్మణచండాలుల, శాస్త్రిగారి సందేహనివృత్తిగా తెలియదగియున్నది.

శ్లో॥ వృత్త్యర్థం దేవతాపూజా నైవేద్యప్రాశనాదిభిః
దార్బ్యబ్రాహ్మణ్యం యదప్యుక్తం తత్రప్రతివిధీయతే,

—యామునాగమే.

అను ప్రమాణముచే వృత్త్యర్థము దేవపూజా నైవేద్యభక్షకులగువారే దేవలకత్వ దార్బ్యబ్రాహ్మణ్యులని శాస్త్రిగారు తెలియదగియున్నది.

శ్లో॥ కలిప్రభావా త్సాంకర్యే సాంప్రతం సముపస్థితే
కుర్వే తాంత్రికమీమాంసాం వైదికానా ముదే.
—తాంత్రికమీమాంసాయాం.

అని కలిప్రభావముచే సంకరమైన వైదికమును గురించి యీ తాంత్రికమీమాంసాశాస్త్రము అప్పయ్య దీక్షితులవారిచే చెప్పబడినదని తెలియవలెను.

మరిన్ని—

శ్లో॥ శ్రుతియుక్తావళ్యుక్తిశ్చ ద్విజబంధు శ్శివద్విజః
తస్య వేదానధికారోనా శివనేపతభారతే.
—తాంత్రికమీమాంసాయాం.

అనిన్ని—

శ్లో॥ ఏతేనాధ్యాపనేజ్యాదా వధికారో నిరాకృతః
శుద్ధదేవలకత్వేన దానంచాస్యనిరాకృతం.

అను ప్రమాణములచే వ్యక్తపడుచున్నది దేవపూజా మాత్రోపజీవులగు దేవలకులు ద్విజబంధువులైన శివార్చకులగువారే ఇజ్యాధ్యయన దాన ప్రతిగ్రహీతృత్వములకు ననర్హులని శాస్త్రీగారు తెలియదగియున్నది.

మరియు—

శ్లో॥ ప్రచ్ఛన్నా వా ప్రకాశా వా వేదితవ్యాః స్వకర్మభిః
అపి చాచరతి స్తేషా మబ్రాహ్మణ్యం విధీయతే
వృత్తితో దేవతా పూజా దీక్షానైవేద్యభక్షణం
గర్భాదానాదిదాహాంత సంస్కారాంతర సేవనం
శ్రౌతక్రియాననుష్ఠానం ద్విజైః సంబంధవర్జనం
ఇత్యాదిభి రనాచారై రబ్రాహ్మణ్యస్య నిర్ణయః
యేషాం వంశక్రమా దేవ దేవార్చా వృత్తితో భవేత్
తేషా మధ్యయనే యజ్ఞే యాజనే నాస్తి యోగ్యతా.
—యామునాగమే.

అను ప్రమాణముచే శుద్ధదేవలకులగువారు శివద్విజులగు అబ్రాహ్మణు లనియును, అట్టివారే ద్విజసంబంధ వర్జితులగు వా

రనియు, యజనయాజనాది షట్కర్మాధికారాయోగ్యులనియు, వృత్తి దోషులనియు, దుర్బ్రాహ్మణులనియు, నిట్టి ప్రబలప్రమాణములచే దేవలకత్వదోషము శివద్విజులకు నేర్పడినదని శాస్త్రిగారు తెలియదగియున్నది.

మరియు నిట్టి దోషవృత్తులు శ్రీ పాంచరాత్ర ప్రవర్తకులగు శ్రీవైష్ణవులయందు లేవని దశవిధ వైష్ణవ లక్షణంబుల బ్రదర్శించెదను.

ఇది శ్రీ పాంచరాత్రాగమ దివ్యశాస్త్ర విషయప్రదర్శనియందు
దేవలకత్వ యాజకాది వృత్తిదోష విషయ మను
ఏకాదశ ప్రకరణము సంపూర్ణము.

---

శ్రీరస్తు.

# శ్రీ పాంచరాత్రాగమదివ్యశాస్త్రవిషయప్రదర్శని

అను

# తాంబూలదుర్వాదఖండనము.

ద్వాదశప్రకరణ ప్రారంభము.

దశవిధవైష్ణవలక్షణ శ్రీ వైష్ణవ సమయాచార, విషయము.

శ్లో॥ అద్వేష శ్చానుకూలీ చ దివ్యనామధర స్తథా
చక్రాంకో మంత్రపారశ్చ వైష్ణవశ్చ తతఃపరం
శ్రీవైష్ణవప్రపన్నశ్చ ఏకాంతీచ తతఃపరం
పరమైకాంతి విఖ్యాతో దశైతే వైష్ణవా స్స్మృతాః.

—ప్రపన్నధర్మసారసముచ్చయే.

అని దశవిధములుగా వైష్ణవులున్నారని తెలియవలెను.

అందు—

శ్లో॥ విష్ణుం లోకనియంతారం వైష్ణవా లోకపావనం
దృష్ట్వా న ద్వేష్టి యో మర్త్య స్సోఽద్వేషః పరికీర్తితః.

అనువారు అద్వేషులనిన్ని—

శ్లో॥ వాసుదేవోత్సవాం శ్చైవ మహాభాగవత స్తథా
అనువర్తేత యో నిత్యం అనుకూలీ ఉదాహృతః.

అను వృత్తిగలవారు అనుకూలురనిన్ని—

శ్లో॥ స్మృత్యుచ్చారణమాత్రేణ సర్వపాపప్రణాశనం
విష్ణునామధరః పుణ్యో నామధారీ స ఉచ్యతే.

అను వృత్తిగలవారు నామధారులనిన్ని—

శ్లో॥ శ్రుతిస్మృతిపురాణేషు విహితం చక్రధారణం
యో బిభర్తి హరే శ్చక్రం చక్రధారీ స ఉచ్యతే.

అనువారు చక్రధారులనిన్ని—

శ్లో॥ అష్టాక్షరస్య మంత్రస్య స్మరణా న్ముక్తిదో హరిః
త మావర్తేత యో నిత్యం మంత్రపాఠ స్స ఉచ్యతే.

అనువారు మంత్రపాఠకులనిన్ని—

శ్లో॥ దేవతాంతరవ స్నిత్యం శబ్దాదీ నపి కుత్సయన్
విష్ణుప్రాప్తిఫలాకాంక్షీ భక్త్యుపాయో హి వైష్ణవః.

అను వృత్తిగలవారు వైష్ణవులనిన్ని—

శ్లో॥ బాహ్యార్థనిరతా న్సర్వా న్సమ్య క్త్యక్త్వా సదాశుచిః
భక్తిమాన్ పుండరీకాక్షే శ్రీవైష్ణవ ఉదాహృతః.

అనువారు శ్రీవైష్ణవులనిన్ని—

శ్లో॥ శబ్దాదీ న్విషయాం శ్చైవ దేహోపాధికబాంధవాన్
త్యక్త్వా హరౌ న్యస్తభర స్స ప్రపన్న ఉదాహృతః.

అనునట్టివారు ప్రపన్నులనిన్ని—

శ్లో॥ హరే రాజ్ఞానురూపేణ కర్మజ్ఞానాది యో నరః
స ఏకాంతీ భవే ద్విప్ర స్స హి భాగవతః స్మృతః.

అనువారు ఏకాంతులను భాగవతులనిన్ని—

శ్లో॥ ప్రీత్యర్థం వాసుదేవస్య కర్మజ్ఞానాదికం నరః
స విప్రః పరమైకాంతీ మహాభాగవతః స్మృతః.

అనువారు పరమైకాంతి మహాభాగవతులనిన్ని, ఇట్లు దశ విధ వైష్ణవ లక్షణమును తెలియదగియున్నది, మరియు, వైష్ణవ సమ యాచారధర్మము లెట్లున్నవో శాస్త్రిగారు తెలియదగు ప్రమాణ ములను ప్రదర్శింతము.

శ్రీవైష్ణవ సమయాచారము—

శ్లో॥ వైష్ణవా న్సమయా న్వక్ష్యే మార్కండేయేన భాషితాన్
శుచౌ దేశే వసే న్నిత్యం విద్వజ్జనప్రసేవితే.

—శ్రీః పింజల సంహితాయామ్ – తృతీయోధ్యాయః.

అనిన్ని—

శ్లో॥ ఆర్యావర్తే కురుక్షేత్రే పాంచాలే బ్రహ్మసాహ్వయే
మధ్యదేశే తథా శౌరేః పుణ్యక్షేత్రే వసే త్సదా.

అనిన్ని—

శ్లో॥ నైవాన్యత్ర వసే న్నిత్యం త్రీణి గ్రామే దినానిచ
అన్యస్మి న్నుభదేశేతు వైష్ణవో నివసే త్సదా.

అను ప్రమాణములచే శ్రీవైష్ణవులకు వాసయోగ్య దేశ ములని శాస్త్రిగారు తెలియవలెను—

శ్లో॥ యత్ర పాషండిన స్సంతి మ్లేచ్ఛా యత్రచ తస్కరాః
వర్ణాశ్రమం వినా యత్ర తద్దేశం పరివర్జయేత్.

అనిన్ని—

శ్లో॥ కళింగసింధుసౌవీరాః కాశ్మీరప్రకర స్తథా
కామరూపాశ్చ యే దేశాః వర్జయే ద్వైష్ణవ స్సదా.

అనియును—

శ్లో॥ శిష్టాచార్యసమర్యాదా యత్ర దేశే న దృశ్యతే
రాజా2 ప్యధార్మికో యత్ర తద్దేశం పరివర్జయేత్.

అనియును—

శ్లో॥ కర్ణాటపారశీకాశ్చ కాన్యత్వాం సింధుకొంకణః
అన్యా న్యధర్మదేశాని వైష్ణవో వర్జయే త్సదా.

అను పాషండ, మ్లేచ్ఛ, తస్కర, అధార్మికప్రభు, దేశ ములు, వర్ణాశ్రమాచారరహితదేశములు, శ్రీవైష్ణవు లయినవారికి వాసయోగ్యములు కానందున అట్టి దేశములు వర్జనీయములని శాస్త్రిగారు తెలియదగియున్నది. మఱియు భక్ష్యాభక్ష్య విమర్శన, వందన, భావన, తీర్థ, ప్రసాద, స్వీకారాది విషయములుగల శ్రీ వైష్ణవ సమయాచారమును తెలియబఱచు ప్రమాణములు.

శ్లో॥ భిక్షాన్నం వైష్ణవస్యాన్నం అన్యత్ప్రాఽభక్ష్య ముచ్యతే
ఉచ్ఛిష్టాదీని సర్వాణి నిర్మాల్యాని న భక్షయేత్.
—శ్రీ కపింజలసంహితాయామ్.

శ్లో॥ అపక్వంచ విపక్వంచ మాంస మన్యగృహాగతం
మద్యం పర్యుషితంచైవ గంధం పుష్పంచ వర్జయేత్.

శ్లో॥ అభక్ష్యాణిచ సర్వాణి శాకాదీనిచ దేశికః
వర్జయిత్వా ప్రయత్నేన సమయాచారతత్పరః
పూజయిత్వా తథా దేవ మతిథిం పూజయే త్తతః.

శ్లో॥ భక్ష్యం భోజ్యంచ పేయంచ న భుంజీయా దనర్పితం.

అను ప్రమాణానుసారము సుపక్వభక్ష్య భోజ్యములను శ్రీ పాంచరాత్ర ప్రవర్తకులైన శ్రీ వైష్ణవులందరు భగవన్నివేదనము చేసియే భుజింతురని యాజిగారు తెలియవలెను.

శ్లో॥ వైష్ణవా న్భోజయే న్నిత్యం దరిద్రోఽపి స్వశక్తితః
విష్ణుచిహ్నాంకిత న్సర్వాన్ భావయే ద్ధరిరూపతః.
అనిన్ని—

శ్లో॥ నమస్కుర్యాచ్చ తా న్సర్వాన్ భక్తిభావసమన్వితః
స్వయం నమస్కృతో యేన నమస్కుర్యా త్పున శ్శతమ్.
అనిన్ని—

శ్లో॥ విష్ణ్వాచారపరా న్య స్తు నాస్తికః ప్రహసేద్యది
స తు దండ్యో భవే ల్లోకే సర్వదా వైష్ణవోత్తమైః.
అనియును—

శ్లో॥ వైష్ణవస్యాపదే ప్రాప్తే వైష్ణవ శ్శరణం భవేత్
సమర్థ శ్చాప్యుదాసీనః స్వయం వధ్యస్తు వైష్ణవః.
అనియును—
శ్లో॥ హరితీర్థప్రసాదం వా స్వీకుర్యా ద్భక్తియోగతః
రసగంధాదిలోభేన స్వీకర్తా విష్ణుకంటకః.
అనిన్ని—
శ్లో॥ త్రిసంధ్యం దేవదేవస్య తీర్థం మాల్యాంచ నిత్యశః
భూమా వప్రచ్యుతం గృహ్య ధారయే ద్వైష్ణవోత్తమః.
అనియును—
శ్లో॥ శూన్యేన పాణినా దత్తం తీర్థం యో వైష్ణవః పిబేత్
పురీషపాదో విజ్ఞేయః స వైష్ణవబహిష్కృతః.
అని శ్రీవైష్ణవ సమయాచార ధర్మములను శాస్త్రిగారు బాగుగ స్వరూపధర్మముల వల్ల తెలియ నగును.
తాపసంస్కార నిరూపణము—
శ్లో॥ విష్ణులాంఛనశూన్యస్తు, పూజ్యతే యత్ర కేశవః
తత్ర నిర్యాతి దేవస్య కళా సన్నిహితా పురా
జపే దష్టాక్షరం మంత్రం మాతృకాన్యాసపూర్వకం
పూజార్థమై దేవభవనం ప్రవిశే త్ప్రాజ్ఞోత్తమః
హరేః పాదోదకం య స్తు శంఖేన పరిపూర్యచ
వైష్ణవా న్పాయయే న్నిత్యం స విష్ణు ర్నాత్ర సంశయః
పరనిందాపరో యస్తు పరదారేషు లోలుపః
చక్రాంకిత శరీరస్తు సన పాపైః ప్రముచ్యతే
నియతో విష్ణుధర్మేపి న నింద్యా ద్దర్శనాంతరం.
అనియును— —శ్రీకపింజలసంహితాయామ్.
శ్లో॥ యస్తప్తశంఖచక్రాభ్యాం విముక్త స్సర్వకిల్బిషైః
ఉపవీతా ద్యథా విప్ర స్స భవే ద్వైష్ణవద్విజః.
అని శ్రీవైష్ణవులందరు భగవ దుపాసనార్చనార్హులగుటకు ఉపనయనాది సంస్కారమువలె తప్త చక్రాంకన దీక్షాసంస్కారమును ఆచరింతురని శాస్త్రిగారు తెలియునది—

శ్లో॥ అవైష్ణవగృహే యస్తు భుంజీయా ద్గతసాధ్వసః
భ్రష్టాచార స్స విజ్ఞేయో విష్ణులోక పరాఙ్ముఖః.
—భ్రష్టాచార నిరూపణము.

అనునట్లు అవైష్ణవ గృహములయందు భుజించువారు విష్ణులోక పరాఙ్ముఖులయిన భ్రష్టాచారులని తెలియవలెను.

శ్లో॥ విష్ణువైష్ణవభోగార్థం స్వార్జితం పరికల్పయేత్
అవశిష్టం తృతీయాంశం భుంజీయా ద్విష్ణుముండకం
విష్ణుముండం విజానీయా ద్విష్ణురేవ న సంశయః.

ఇట్లు నిర్విశంకమైన భగవద్ధర్మము పాంచరాత్రాగమ ధర్మ ప్రవర్తకులగు శ్రీవైష్ణవు లందరికీ స్వమతాచారధర్మమనియు, దేవలకాదివృత్తిదోషము కాదనియు, అట్టి యాజకాది వృత్తిదోష మహాపాతకులయినవారు వైదికబ్రాహ్మణులలోనే యున్నారనియు, దేవతాంతర పూజా మాత్రోపజీవులగు హారద్విజులే దుర్బ్రాహ్మణులైన శుద్ధదేవలకులనియు, చక్రాంకనదీక్షా సంస్కారరహితులు విష్ణ్వర్చనము చేసినయెడల వృత్తిదోషులై దేవలకు లగుదురనియు, ఇట్టి శ్రీవైష్ణవ ధర్మములను తెలియబరచి, శ్రీవైష్ణవ సమయాచార సద్ధర్మములను సదాచార్యోపదేశమున శాస్త్రిగారు శ్రీ పాంచరాత్ర విషయమై తమ సంశయ నివృత్తిగా తెలియదగు ప్రమాణములు.

శ్రీ వైష్ణవ సమయాచారము—

శ్లో॥ ఆచార మథ వక్ష్యామి వైష్ణవస్య విశేషతః
బ్రాహ్మణాదీని వర్ణాని చాచారం శృణు సువ్రత.
—శ్రీ పాంచరాత్ర దివ్యాగమే కపింజలసంహితాయాం చతుర్థోధ్యాయః.

అనియును—

శ్లో॥ బ్రాహ్మణః క్షత్రియో వైశ్య శ్శూద్రో వా ప్యనులోమజః
అత్రానులోమజా శ్శ్రేష్ఠా ప్రతిలోమేషు వర్జితాః.

అనిన్ని

శ్లో॥ ప్రతిలోమేషు విప్రేంద్ర సూతకస్తు న నిందితః
న చ సంస్కార మర్హంతి వర్ణాశ్రమ బహిష్కృతాః.

అనియును—

శ్లో॥ బ్రహ్మచారీ గృహస్థశ్చ వానప్రస్థశ్చ భిక్షుకః
ఏకైకస్య చతుర్భేదై రాశ్రమో భిద్యతే పురా.
అనియును—
శ్లో॥ దండాజినధరో యస్తు దీక్షిత స్సకమండలుః
అష్టాక్షరపరో నిత్యం భైక్షాహారో మితాశనః.
అనిన్ని—
శ్లో॥ భూషాయాచాగ్నిపూజాది దేవతారాధనే రతః
గురుపాదరతో నిత్యం బ్రహ్మచారీ స ఉచ్యతే.
అనియును—
శ్లో॥ శంఖాది స్వేచ్ఛయా ధారీ లింగీతి పరికీర్తితః
భిక్షాశీ గురుశుశ్రూషీ పఠే ద్దైవ వేదసంహితాం.
అనిన్ని—
శ్లో॥ ఛాయేవాఽనుచరే న్నిత్యం స శిష్య ఇతి కీర్తితః
త్రిసంధ్యం పూజయే ద్దేవం జపహోమ పురస్సరం.
అనియును—
శ్లో॥ ఉపాసక ఇతి జ్ఞేయ స్సంహితాధ్యయనే రతః
వ్రతోపవాస నిరతో ఋతుగామీ ద్విజోత్తమః.
అనిన్ని—
శ్లో॥ సంప్రోతేన సముద్దిష్టో దేవపూజనతత్పరః
పంచయజ్ఞరతో నిత్యం శిష్యాణాం భరణే రతః.
అనియును—
శ్లో॥ గృహస్థ ఇతి విజ్ఞేయ స్స్వదారనిరత స్సదా
వీతరాగపరో నిత్యం దేవోత్సవ పరాయణః.
అనిన్ని—
శ్లో॥ ఆచార్య ఇతి విజ్ఞేయో భక్తానాం భరణే రతః
యజనాధ్యాపనే యుక్తః శిష్యానుగ్రహకారకః.

అను ప్రమాణములచే అర్హులైన శ్రీ పాంచరాత్రిస్వాములును, అయ్యవార్లంగారును ఒక్కటే నను అభిప్రాయము లేక భేదాభిప్రాయపడు నక్షత్ర యాజక శ్రేష్ఠులయిన శాస్త్రిగారు వైష్ణవ

సమయాచారవిధి ధర్మములవలన, ఆచార్యశబ్దమునందు భేదము లేదని యును, భగవన్నిత్యోత్సవ కరాయణులును, శిష్యానుగ్రహకారకు లైనవారు ఆచార్యులేయనియును, పాంచరాత్రము ఏకాయన శాఖా మూలవేదంబైన ఆగమ ప్రామాణ్యమనియును, అట్టి భగవన్నిష్ఠా నుష్ఠాతలైన శ్రీ పాంచరాత్రాగమ ప్రవర్తక శ్రీ వైష్ణవోత్తములగు వారందరు వక్కటేననియు, శ్రీ పాంచరాత్రముకాని వైష్ణవమే లేద నియు సాంప్రదాయిక ధర్మములచే తెలియదగియున్నది. అట్టి శ్రీ పాంచరాత్రాగమ భగవద్ధ్యానస్థాన దీక్షా సంస్కారములు పాంచ రాత్ర శ్రీవైష్ణవులగు సాత్వత మహాభాగవతోత్తములకు స్వాభావిక వేదవిధియగు స్వధర్మమేనని, వృత్తిదోషము కాదని శాస్త్రిగారు బాగుగ తెలుసుకొందురుగాక.

ఇది శ్రీ పాంచరాత్రాగమ దివ్యశాస్త్ర విషయప్రదర్శనియందు
శ్రీ వైష్ణవ సమయాచారాది విషయమను
ద్వాదశప్రకరణము సంపూర్ణము.

---

శ్రీరస్తు.

# శ్రీ పాంచరాత్రాగమదివ్యశాస్త్రవిషయప్రదర్శని

అను

# తాంబూలదుర్వాదఖండనము.

త్రయోదశ ప్రకరణ ప్రారంభము.

## సాత్వతాచార ధర్మవిషయము.

ఆచారసాత్వతయోః దేవపూజనమ్—

శ్లో॥ నహి భాగవత్తై స్సర్వైర్వృత్తయేఽభ్యర్చితో హరిః.
—యామునాగమప్రామాణ్యే.

అనగా భగవదర్చనము సాత్త్వికులగు శ్రీ వైష్ణవులందరికిని స్వమతాచారధర్మమేగాని దోషవృత్తిగాదని నక్షత్రయాజిగారు తెలియదగి యున్నది.

మఱియు —

శ్లో॥ క్లుప్తావయవశక్త్యైవ లబ్ధే స్వార్థావబోధనే
నష్టావయవమాంసత్వం ప్రత్యాచష్టచ సూత్రకృత్
తే సాత్వతా భాగవతా భజ్యతే యైః పరః పుమాన్
తే సాత్వతా భాగవతా ఇత్యుచ్యంతే ద్విజోత్తమాః.

— యామునాగమే.

అని వివ్వర్చకులైన పాంచరాత్రాది వైష్ణవులగు సాత్వత మహాభాగవతులు బ్రాహ్మణోత్తములే యనియును, వృత్తిదోషులు కారనియు తెలియవలెను.

శ్లో॥ దుర్లభో భగవద్భక్తో లోకేఽస్మి న్పురుష స్తథా
తత్రాపి దుర్లభతరో భావో వై యస్య తత్త్వతః
పాదోదకం ప్రతిశుభ స్సిద్ధాన్నేచ నివేదితే
స్రగాదికే చోపభుంక్తే హ్యుపభోగార్థ మేవ చ
అతశ్చ భావహీనానా మభక్తానాంచ పణ్ముఖ!

— ఈశ్వరసంహితాయాం - యామునాగమే.

అను ప్రమాణముచే భగవద్ధర్మ ప్రవర్తక భగవత్పుత్రులగు పాంచరాత్ర వైష్ణవులు లోకములో లభించుట దుర్లభమనియు, సేవ్యమానులనియు, ధర్మాధికారులనియు, భగవత్తీర్థ ప్రసాద నిర్మాల్యాదుల నుపభోగముగా సేవించుట స్వమత ధర్మమేగాని దోషవృత్తి గాదనియు, సాత్వత భాగవత బ్రాహ్మణులైన వైష్ణవులు అట్టి దోష వృత్తులు గారనియు, గ్రామయాజక రాజాశ్రిత నక్షత్ర యాజకులగు వృత్తిదోషులు వైదికమునందే యున్నారనియు శాస్త్రిగారు తెలియదగియున్నది.

"శ్రీ గోవిందగోవింద, అద్య బ్రహ్మణః, శ్రీమహావిష్ణో రాజ్ఞయా" అని భగవదాజ్ఞయా భగవద్ధర్మ ప్రవర్తకులైన పరమవైదిక బ్రాహ్మణులే శ్రీపాంచరాత్ర స్వాములని తెలియవలెను.

—సంకల్పవాక్యము.

శ్లో॥ కేచి ద్వాది పరం సంతః సాత్వతా వృత్తికర్శితాః
యాజయంతి మహాభాగా రైష్ణవై ర్వృత్తికారణాత్.

—యామునాగమే.

అనుటచే విష్ణ్వర్చకులగు వైష్ణవులకు భగవదర్చనము స్వధర్మమేయనియు, అట్టి ధర్మము నన్యయాజకు లవలంబించిరేని యన్యమతాచార ధర్మాచరణ లగుటవల్ల అట్టివారు వృత్తిదోషు లగుదు రని యాజిగారు తెలియవలెను.

ఇదియునుంగాక—

క॥ హరిభక్తులు పుణ్యాత్ములు, పరికింపగ వారి గన్న పాపము లణగున్
పరమపవిత్రితము లగుత, చ్చరణాబ్జపరాగ లేశ సంస్పర్శమునన్.

—శైవధర్మము.

సీ॥ హరినామసంకీర్తనార్చనవందన పరమసేవారతుల్ భాగవతులు
వేదశాస్త్రపురాణ విధిధేతిహాసాది బహుకథాభిజ్ఞులు భాగవతులు
దేవగురుద్విజ దీనమాతాపితృబంధుపోషణరతుల్ భాగవతులు
పరమపదధ్యానపారీణతాస్వాంతపరమపుణ్యోదయుల్ భాగవతులు
భానుసూక్తపరాయణుల్ భాగవతులు
పావకార్చననియతుల్ భాగవతులు
పరహితాచార కర్తలు భాగవతులు
బ్రహ్మనిష్ఠాగరిష్ఠులు భాగవతులు.

—శైవధర్మము.

అను ధర్మశాస్త్ర ప్రమాణములచే సాత్వతి మహాభాగవతోత్తములగు శ్రీపాంచరాత్ర వైష్ణవులే బ్రహ్మనిష్ఠాగరిష్ఠు లని శాస్త్రిగారు తెలియవలెను.

శ్లో॥ బ్రాహ్మణైః క్షత్రియై ర్వైశ్యైః శూద్రైశ్చ కృతలక్షణైః
అర్చనీయశ్చ సేవ్యశ్చ పూజనీయశ్చ మాధవః
సాత్వతం విధి మాస్థాయ గీతసంకర్షణేన యః
ద్వాపరస్య యుగస్యాంతే ఆదౌ కలియుగస్య చ.

—యాముసాగమే - మహాభారతే, భీష్మపర్వణి.

అను ప్రమాణముచే బ్రహ్మవిష్ణుగిరీశులగు సాత్వత బ్రాహ్మణ ధర్మమైన పాంచరాత్రాగమ భగవద్ధర్మము కల్పాది భగవచ్ఛాసనంబై యుగత్రయంబులయం దనువర్తింపబడి ద్వాపరాంత కలియుగాదిధర్మమై లోకహితార్థము సర్వజనోపయోగముగా ప్రవర్తించిన కలియుగ ధర్మమని పాంచరాత్ర విషయమై శాస్త్రిగారు తెలియవలెను. మరియు

శ్లో॥ అగ్నిర్న కల్పో ఽధ్యయనం న కల్పో
స్వాభావికో వేదవిధి ర్న కల్పః
పరస్య విత్తాహరణం న కల్పః
తా న్యేవ భావోపహతాని కల్పాః.

—శ్రీమహాభారతే.

అని యుండుటచే కల్పాదిభగవద్ధర్మము పాంచరాత్రాది వైష్ణవులకు స్వమతాచారమైన స్వాభావిక వేదవిధియే యనియును అట్టి స్వాభావిక ధర్మము కల్పలేదనియు తెలియవలెను.

శ్లో॥ చతుర్వేదోఽపి దుర్వృత్తః సూక్ష్మం బ్రహ్మ న విందతి.

—శ్రీమహాభారతే.

అనుటచే జీవన్ముక్తుల కావశ్యకంబగు భగవద్భక్తిజ్ఞాన ధర్మము వైష్ణవులకు స్వమతాచారమేయనియు, అట్టి ధర్మ మెఱుగని వారే దుర్వృత్తులగుచున్నారని సాత్వతధర్మములచే శాస్త్రిగారు తెలియవలెను.

శ్లో॥ శ్రీపతి స్సర్వదోపాస్యో భోగమోక్షేచ్ఛుభి ర్జనైః
అన్యే బ్రహ్మాదయో దేవా నోపాస్యాస్తు ముముక్షుభిః

మహాభాగవతా స్సేవ్యా స్సచ్ఛాస్త్రం తదుదీరితం
ఇతి విజ్ఞాయ తత్త్వార్థం సదాచార్యోపదేశతః.

—ప్రసన్నధర్మ సారసముచ్చయే.

అను ప్రమాణానుసారము ముముక్షువులగు శ్రీవైష్ణవులకు శ్రీమన్నారాయణుడే యుపాస్యుడనియును, బ్రహ్మాద్యన్యదేవతలు ఉపాసకులు గారనియు, శాస్త్రిగారు అట్టి భగవత్తత్త్వార్థమును సదాచార్యోపదేశమున తెలియనగును.

శ్లో॥ పాంచరాత్రప్రమాణత్వ నిషేధో ఽతిప్రసంగతః
తత్రానువాదసందేహ జ్ఞానా నుత్పత్తిలక్షణా.

—ఆగమప్రామాణ్యే.

అని మోక్షజ్ఞానార్థ స్వరూపోత్పత్తిలక్షణమగు శ్రీపాంచరాత్ర భగవద్ధర్మమునందు నిషేధాతిప్రసంగములు లేవని తెలియవలెను.

శ్లో॥ వేదప్రశంసా బహుశః పంచరాత్రేపి దృశ్యతే
న హి తేభ్యః పరం కించి ద్వాఙ్మయం కమలాసన!

అట్టి భగవద్ధర్మ వేద ప్రశంస శ్రీపాంచరాత్రాగమమునందే ప్రదర్శింపబడియున్నదని తెలియవలెను.

మఱియు—

శ్లో॥ నిరస్త మప్రమాణత్వం విజ్ఞానగ్రహణా దిహ
వక్తృత్రయాపరః ప్రోక్తః మిథ్యాత్వం శాకినుత్తయే
ఆదిశబ్దేన తంత్రాణా మాప్తోక్తత్వం వివక్షితం.

అని తంత్రము లన్నిటికంటె పాంచరాత్రాగమ సాత్వత తంత్రము ఆప్తనీయమైనదనియును, చతుర్వేద సమన్వితమైనదనియును, మహోపనిషత్తనియును శాస్త్రిగారు తెలియవలెను.

శ్లో॥ ఇతి స్కందపురాణేపి పఠ్యతే భారతే తథా
పాంచరాత్రప్రవర్తస్య వక్తా నారాయణ స్స్వయమ్
ఇదం మహోపనిషదం చతుర్వేదసమన్వితం

సాంఖ్యయోగకృతాంతేన పాంచరాత్రానువర్తితం
నారాయణముఖోద్గీతం నారదోఽ శ్రావయన్మునీన్.
—యామునాగమే.

అను ప్రమాణానుసారము శ్రీమన్నారాయణ ముఖోద్గీత మైన శ్రీపాంచరాత్రాగమశాస్త్రమును స్కాందభారత మహాపురాణాదులయందు వ్యాసప్రోక్తమై వర్ణింపఁబడి యున్నదని తెలియవలెను.

శ్లో॥ అనర్థోపశమం సాక్షాద్భక్తియోగ మధోక్షజే
లోకస్యాజ్ఞానతో విద్వాం శ్చక్రే సాత్వతసంహితాం.
—శ్రీమద్భాగవతే – సప్తమాధ్యాయే.

అను ప్రమాణముచే మహాఋషిప్రవర్తన ధర్మమైన సాత్వతసంహితయగు శ్రీపాంచరాత్రగను భగవద్ధర్మశాస్త్రము, అనర్థోపశమన మైనదనియును, సాక్షాద్భగవద్భక్తియోగమైన జ్ఞానశాస్త్రమనియు నక్షత్రయాజక శ్రేష్ఠులయిన శాస్త్రిగారు తెలియవలెను.

శ్లో॥ సబ్రహ్మకా స్సరుద్రాశ్చ సేంద్రా దేవా స్సహర్షిభిః
అర్చయంతి సురశ్రేష్ఠం దేవం నారాయణం ప్రభుం.
—శ్రీభాష్యే, మహాభారతే, మోక్షపర్వణి)

అను ప్రమాణానుసారము, బ్రహ్మ, రుద్ర, ఇంద్రాదిదేవర్షులందరు, సురశ్రేష్ఠుండైన శ్రీమన్నారాయణు నర్చించెదరని శాస్త్రిగారు తెలియదగియున్నది.

ఇది శ్రీపాంచరాత్రాగమ దివ్యశాస్త్రవిషయ ప్రదర్శనియందు
సాత్వతాచార ధర్మవిషయమను త్రయోదశ
ప్రకరణము సర్వము సంపూర్ణము.

---

*

శ్రీరస్తు.

# శ్రీపాంచరాత్రాగమదివ్యశాస్త్రవిషయప్రదర్శని

అను

# తాంబూలదుర్వాదఖండనము.

## చతుర్దశప్రకరణ ప్రారంభము.

### దానపాత్రసభాపూజ్యాధికారవిమర్శనము.

ఆస్తికమహాశయులారా! శ్రీపాంచరాత్రాచార్యస్వాములు సర్వలోక సంపూజ్యులని, సర్వజన సంసేవ్యులని, నక్షత్రియాజక శ్రేష్ఠులయిన శాస్త్రిగారు, తెలియక ప్రసంగించు నశాస్త్రీయదుర్వాదము నిర్వాదమగునట్లు ఖండనరూపముగా ననేక ధర్మశాస్త్ర ప్రమాణములచే దానపాత్ర సభాపూజ్యాధికార బ్రాహ్మణు లెటువంటివారో విమర్శింతము.

శ్లో॥ శ్వశూద్రపతితాంశ్చైవ రాజసభాంచ రజస్వలాం
దృష్ట్వా తోయముపస్పృశ్య భాష్య స్నాత్వాపునర్జపేత్.
—నారదీయే.

అను ప్రమాణముచే శూద్రులను, పాతకులను, రాజసభను, రజస్వలాస్త్రీని, దర్శింప గూడదనియు, భాషింప గూడదనియు, తెలియుచున్నందున—

శ్లో॥ జన్మనా జాయతే శూద్రః కర్మణా జాయతే ద్విజః
వేదపారంతు విప్రాణాం బ్రహ్మజ్ఞానం తు బ్రాహ్మణః.

అని యుండుటచే పుట్టినవారందరును మొదట శూద్రులే. బ్రహ్మజ్ఞాన సంపత్తియైన వేదకర్మప్రధానులగుటచే జాతివిశేషమువలన బ్రాహ్మణులు సభయందు అధ్యక్షులగుదురు. అందు బ్రహ్మజ్ఞాన సంపత్తియైన వేదకర్మానుష్ఠాతలు కాక జన్మమాత్రబ్రాహ్మ

ణులు శూద్రసమాను లగుటచే అట్టివా రపూజ్యులగుదురని తెలియ దగి యున్నది

మఱియు—

శ్లో॥ చక్రలాంఛనహీనస్య ద్విజత్వం నిష్ఫలం భవేత్.

—పరాశరస్మృత్యుత్తరఖండే.

అని యుండుటచేతను—

శ్లో॥ అధృత్వా విష్ణునా చక్రం బ్రాహ్మణో జ్ఞానదుర్లభః.

—పాద్మే.

అని యుండుటచేతను.

శ్లో॥ నష్టశౌచా మూఢధియో జటాభస్మాస్థిధారిణః
విశంతు శివదీక్షాయాం యత్ర దైవం సురాసవం.

—శ్రీమద్భాగవతే - చతుర్థస్కంధే - తృతీయాధ్యాయే

అనుప్రమాణములచే భృగుశాపంబున నష్టశౌచాచారులై మూఢులై జటాభస్మాస్థిధారులైనవారే మతత్రయాధికారమం దపూజ్యులని శాస్త్రిగారు తెలియదగియున్నది.

మఱియు—

శ్లో॥ సత్త్వాత్సంజాయతే జ్ఞానం రజసో లోభ ఏవచ
ప్రమాదమోహౌ తమసో భవతో జ్ఞాన మేవచ.

—భగవద్గీతా - చతుర్దశాధ్యాయే - గుణత్రయ విభాగయోగే.

తా॥ సాత్త్వికగుణమువలన జ్ఞానమును, రజోగుణముచే లోభమును, తమోగుణముచే అజాగ్రత, అజ్ఞానము గలుగుచున్నది, అని శంకరాచార్య తాత్పర్య ముండుటచే సాత్త్వికోపాసకులు వైష్ణవులగుటచే రజస్తమోగుణోపాసకులయిన బ్రాహ్మణులే అజ్ఞానులని తెలియ వచ్చుచున్నది.

అట్టి గుణత్రయోపాసనాఫలము

శ్లో॥ యదా సత్త్వే ప్రవృద్ధేతు ప్రళయం యాతి దేహభృత్,
తదోత్తమవిదాం లోకా నమలా న్ప్రతిపద్యతే.

—గీతాశాస్త్రే గుణత్రయ విభాగయోగే,

తా॥ దేహికి సాత్త్వికము హెచ్చైనదశలో మరణము గలిగె నేని యపుడు స్వచ్ఛమైన బ్రహ్మలోకమును జెందుచున్నాడు. అని శంకరాచార్య తాత్పర్యము.

మఱియు—

శ్లో॥ రజసి ప్రళయం గత్వా కర్మసంగిషు జాయతే,
తథా ప్రలీన స్తమసి మూఢయోనిషు జాయతే.

శంకరాచార్య కృత తాత్పర్యము:— రజోగుణము హెచ్చైన స్థితిలో మృత్యువు సంభవించెనేని శునకవరాహాదినికృష్టజన్మల నెత్తుచున్నారని యుండుటచేత, రజోగుణోపాసకు లధోగతితిర్యగ్గతుల బొందుదురని తెలియవచ్చుచున్నందునను

శ్లో॥ ఊర్ధ్వం గచ్ఛంతి సత్త్వస్థా మధ్యే తిష్ఠంతి రాజసాః
జఘన్యగుణవృత్తిస్థా అధో గచ్ఛంతి తామసాః,
—భగవద్గీత.

అను ప్రమాణముచే సత్త్వస్థులు ఊర్ధ్వలోకమును పొందుదురనియు, రాజస తామస గుణోపాసకులగు నైదిక మిశ్రవైదికులు అధోగతి బొందుదురనియు, అట్టి యజ్ఞాన గుణోపాసకులైన నష్టశౌచాచారులగు నామమాత్ర బ్రాహ్మణులు అజ్ఞానగుణోపాసకు లగుటచే నట్టివారే శూద్రులనియును.

శ్లో॥ రాజాశ్రయేణ యో మర్త్యో ద్వాదశాబ్దం వసే న్నృధః
జీవమానో భవే చ్ఛూద్రో నాఽత్ర కార్యా విచారణా.
—మహాభారతే_అశ్వమేధకే.

అనియుండుటచే వంశపరంపరగా, రాజాశ్రితులైనవారే శూద్రసమాన భావులగు బ్రాహ్మణులని తెలియదగియున్నది.

పాతకులును, అనగా యాజకాదిమహాపాతకులని తెలియదగు ప్రమాణములు.

శ్లో॥ కుండాశీ గోళకాశీచ తథైవ గ్రామయాజకః
అయాజ్యయాజకశ్చైవ మహాపాతకిన స్స్మృతాః
వ్రాత్య స్సంస్కారహీన స్స్యా దవకీర్ణి కృతవ్రతః.
—స్మృతిరత్నాకరే.

అనియును—

శ్లో॥ ఆహ్వాయకా దేవలకా నక్షత్రగ్రామయాజకాః
ఏతే బ్రాహ్మణచండాలాః......
—యామునాగమే.

అని యుండుటచే గ్రామయాజక నక్షత్రయాజకాది యాజకులే మహాపాతకు లని తెలియఁగియున్నది. మఱియు శివసేవా భస్మత్రిపుండ్రధారులైన శివద్విజు లపూజ్యు లగుదురు.
—యామునాగమే.

శ్లో॥ అన్యథా వైదికానాం త ద్దేవసేవా ఽప్యసంగతా
అత శ్శివద్విజ స్త్వేవ్యో వైదిక స్సర్వకర్మసు.
—తాంత్రికమీమాంసాయామ్.

అను ప్రమాణముచే వైదికులకు శివసేవ లసంగతమనుటచే నట్టి యవైదికులైన శివద్విజులు వేదాధ్యయనాధ్యాపన దాన ప్రతిగ్రహీణులు కారని, అబ్రాహ్మణు లనియు, శుద్ధదేవలకు లనియు తెలియజేయు ప్రమాణములు.

శ్లో॥ ఏతేనాఽధ్యాపనేజ్యాదా వధికారో నిరాకృతః
శుద్ధదేవలకత్వేన దానం చాఽస్మై నిరాకృతం.
—తాంత్రికమీమాంసాయామ్.

అనియును—

శ్లో॥ స్మృతిమార్గావలమ్బ్యేకశ్చ ద్విజబంధు శ్శివద్విజః
తస్య వేదాధికారో న శ్రవణం నాఽపి భాంతే.

అనియును—

శ్లో॥ కపాలకేశభస్మాస్థితుక్తిపాషాణధారిణం
త్రిపుండ్రధారిణం విప్రం చండాలమివ సంత్యజేత్.
—పరాశరస్మృత్యుత్తరఖండే.

అనియును:—

శ్లో॥ శంభోర్నివేదితం భక్తం తత్తీర్థం శాకమేవ వా
విప్రః కదా న భుంజీయా ద్భుక్త్వా తప్తం సమాచరేత్.
—హేమాద్రిప్రాయశ్చిత్తకాండే.

అనియును—

మరియు—

శ్లో॥ విప్రః కంఠగతప్రాణః క్రీతాన్నం యది భుంజతే
గ్రామేవా నగరే తీర్థే మహాదేవాలయేఽపి వా
స గత్వా నరకం ఘోరం నానాయోనిషు జాయతే.

అని యున్నందున శివదీక్షాపరాయణు లవైదికు లని తెలియదగియున్నది. ఇట్టి శైవాచారులైన బ్రాహ్మణులను, రజస్వలాస్త్రీని, వీరలను దర్శింపగూడదనియు, వారితో భాషింపగూడదనియు, నారదీయసంహితచే తెలియుచున్నందున, యాజకాది వృత్తిదోషులగు పాతకులును, పాషండులును, ధర్మార్థవిషయమున వర్జితులని తెలియదగు ప్రమాణము.

శ్లో॥ ధర్మేణాధిష్ఠితో రాజ్ఞా ధార్మికేణాఽభిపాలితః
మ్లేచ్ఛపాషండపతిత సింహవ్యాఘ్రాదివర్జితః.
—ధర్మసారసముచ్చయే.

అను ప్రమాణముచే యాజకాదిపాతకులును, పాషండులును, ధర్మవర్జితు లని తెలియుచున్నందున పాంచరాత్రులే పూజ్యులని శాస్త్రిగారు తెలియదగియున్నది. మరియు, సమస్తబ్రాహ్మణసముదాయసభామధ్యంబున వందనపూజార్హు లయిన బ్రాహ్మణోత్తము లెవరో విచారింతము.

బ్రాహ్మణసముదాయే ప్రథమం కస్యాఽభివాదన మిత్యాకాంక్ష
యాం మాహ- మనుః.

శ్లో॥ లౌకికం వైదికం వాఽపి తథాఽఽధ్యాత్మిక మేవవా
ఆదదీత యతో జ్ఞానం తం పూర్వ మభివాదయేత్.
—పరాశరస్మృతౌ - ఆచారకాండే.

అను ప్రమాణముచే బ్రాహ్మణసముదాయసభామధ్యంబునందు జ్ఞానస్వరూపులైనవారికే ప్రథమంబున నమస్కరింపదగియున్నదని తెలియుచున్నందున జ్ఞానస్వరూపులైన బ్రాహ్మణోత్తములెవరను ధర్మసందేహమును విచారింతము.

జ్ఞానస్వరూప బ్రాహ్మణధర్మవిషయము.

శ్లో॥ అవిభక్తంచ భూతేషు విభక్త మివ చ స్థితమ్
భూతభర్తృచ తద్జ్ఞేయం గ్రసిష్ణు ప్రభవిష్ణుచ.
—భగవద్గీతాయామ్ - త్రయోదశాధ్యాయే.

శంకరాచార్యకృత తాత్పర్యము:-"సమస్తభూతములను భరించి గ్రహించునట్టియును, మరల బుట్టించునట్టిదియునగు నెరుంగుము" అని యుండుటచే, సృష్టి, స్థితి, లయ, కారణజ్ఞానస్వరూపుడు శ్రీమహావిష్ణువని తెలియుచున్నది. అట్టి జ్ఞానకారణంబైన విష్ణుస్వరూపమును నాలుగు విధములగు జ్ఞానులు సేవింపుచున్నారని తెలియదగు ప్రమాణము.

శ్లో॥ చతుర్విధా భజంతే మాం జనా స్సుకృతినోఽర్జున!
ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీచ భరతర్షభ.
—భగవద్గీతా - విజ్ఞానయోగః.

అను ప్రమాణములచే, ఆర్తులు, జిజ్ఞాసులు, అర్థార్థులు, జ్ఞానులు, సృష్టి స్థితి లయ కారణస్వరూపమైన శ్రీమహావిష్ణువునే జ్ఞానస్వరూపమని ఉత్తమగతిగా నమ్మి భజించుచుందురని తెలియవలెను.

మరియును—

శ్లో॥ ఉదారా స్సర్వ ఏవైతే జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్
ఆస్థిత స్సహి యుక్తాత్మా మా మేవాఽనుత్తమాం గతిమ్.
—శ్రీభగవద్గీతా - సప్తమాధ్యాయే.

పై శ్లోకమందు గనుపరచిన యీ నాలుగు తెగలవారును నుత్కృష్టులే యయినను నందులో జ్ఞానిని నేనే యని నాయభిప్రాయము. ఎందువల్లనన, చలింపని చిత్తముగల జ్ఞాని నన్నే యుత్తమగతిగ నమ్మి యుండును. (అని శంకరకృతతాత్పర్య మునుటచే) జ్ఞానస్వరూపుడు శ్రీమహావిష్ణువే యని తెలియుచున్నది. మరియును—

సర్వదేవనమస్కారః శ్రీకేశవంప్రతి గచ్ఛతి...

అని యును—

శ్రీమహావిష్ణుస్వరూపాణాం బ్రాహ్మణానాం...

అనుటచేతను—

శ్లో॥ ఆచార్యాయ హరేర్దత్వా నాత్మానంచ నివేదయేత్
—భారద్వాజసంహితాయాం - తృతీయాధ్యాయే.

అనియును—

సాక్షాన్నారాయణో దేవః కృత్వా మర్త్యమయీంతనూం
మగ్నా నుద్ధరతే లోకా న్కారుణ్యా చ్ఛాస్త్రపాణినా.

ఇత్యాదియును—

శ్లో॥ విష్ణుభక్తిపరో దైవో విపరీత స్తథాఽసురః.
—భారద్వాజసంహితాయాం - చతుర్థాధ్యాయే.

అనియును—

(విష్ణుసంబంధేన వైష్ణవః) అను ప్రమాణవాక్యములచే విష్ణుసంబంధులును, మహావిష్ణుస్వరూప బ్రాహ్మణులు నైన విష్ణుభక్తులు, విష్ణుప్రతినిధిత్వేన వైష్ణవులే బ్రాహ్మణసముదాయమునందు జ్ఞానస్వరూపాధికులై ప్రథమవందనార్హు లగుదురని తెలియుదగియున్నది.

మరియు భగవజ్జ్ఞానస్వరూపముచే నధికులని తెలియుదగు ప్రమాణము.

త్రివర్ణపూర్వ శ్శ్రోత్రియో ఽభివాదన మర్హతి

—భారద్వాజసంహితాపరిశిష్టే - తృతీయాధ్యాయే.

అనియును—

విప్రాణాం జ్ఞానతో జ్యేష్ఠమ్

అనియును—

శ్లో॥ సత్త్వాత్సంజాయతే జ్ఞానం.

—శ్రీభగవద్గీతా.

అనియును—

శ్లో॥ క్షేత్రజ్ఞ స్యేశ్వరజ్ఞానా ద్విశుద్ధిః పరమా మతా.

—భారద్వాజపరిశిష్టే - తృతీయాధ్యాయే.

అను ప్రమాణములచే భగవజ్జ్ఞానోత్పత్తిస్వరూప మగు సత్త్వగుణోపాసకులైన పరమైకాంతిమహాభాగవతసాత్త్వతపరమవైదిక బ్రాహ్మణోత్తములు శ్రీపాంచరాత్రవైష్ణవులే యనియును, దేవ బ్రాహ్మణులనియును తెలియవలెను మరియు సర్వదేవాత్మకంబైన పావనశరీరులు శ్రీమహావిష్ణుస్వరూపులగు వైష్ణవులేయనుట తెలియదగు ప్రమాణము.

శ్లో॥ సర్వదేవాత్మకం బ్రాహ్మం శరీరం పావనం స్మృతం.

అనుటచే చక్రాంకితసంస్కారపావనశరీరులై సర్వదేవాత్మకమైన (శ్రీమహావిష్ణుస్వరూపాణాం బ్రాహ్మణానాం అనుస్మృతి) భగవత్స్వరూపులు వైష్ణవులేయని తెలియదగియున్నది. అట్టి చక్రాంకితధారులే జ్ఞానులనుటకు ప్రమాణము.

శ్లో॥ అధృత్వా విధినా చక్రం బ్రాహ్మణో జ్ఞానదుర్లభః.

—పాద్మపురాణే.

అనుప్రమాణముచే చక్రాంకితదీక్షాపరులైన బ్రాహ్మణులే జ్ఞానలభ్యులని తెలియదగియున్నది

మరియు భగవత్స్వరూపులే చక్రాంకితవిష్ణుచిహ్నితులగు వైష్ణవోత్తములని తెలియదగు ప్రమాణము.

శ్లో॥ ప్రకృతిస్పర్శరహితో వాసుదేవో జనార్దనః
తథైవ బ్రాహ్మణో దేవి! విష్ణుచక్రేణ చిహ్నితః.
—పాద్మోత్తరఖండే.

అనుటచే విష్ణుచక్రాంకితసంస్కారాచారపావన శరీరులైన శ్రీమహావిష్ణుస్వరూపబ్రాహ్మణులు వైష్ణవులే యని తెలియదగియున్నది.

అట్టి భగవత్స్వరూపులైన వైష్ణవులకేను ప్రథమమున నమస్కరింపదగినదిగా పూజింపవలసినదిగా బ్రాహ్మణులను విధించినదని తెలియజేయు ప్రమాణము.

శ్లో॥ నివేద్య, వైష్ణవాన్ భక్త్యా పూజయేత్ప్రయతో ద్విజః
—పరాశరస్మృత్యుత్తరఖండే.

అనుటచే నమస్కరించి పూజింపదగినవారు పరమవైదికులయిన వైష్ణవులే యనియును.

శ్లో॥ ఉపవీతం శిఖాబంధం పవిత్రం చోర్ధ్వపుండ్రకం
ధౌతవస్త్రద్వయంచైవ పఞ్చ ముద్రాః ప్రకీర్తితాః.
—ధర్మసారసముచ్చయే.

అనియును—

శ్లో॥ గంగా గీతాచ గాయత్రీ తులసీ గోపిచందనం
ఏకాదశీ హరే ర్నామ సాలగ్రామశిలార్చనం
వైదికాష్టక మేతాని నియమేన దినే దినే
యే భజంతి మహాభక్త్యా తేషామపి నమో నమః.

అను ప్రమాణములచే ఉపవీత, శిఖాబంధ, పవిత్ర, తులసీ, ఊర్ధ్వపుండ్ర, ధౌతవస్త్రద్వయధారులును, భగవద్గీతా, గాయత్రీ, విష్ణుసాలగ్రామార్చన, దీక్షాపరులయిన మహాభాగవత బ్రాహ్మణులే నమస్కారార్హు లగుదురని వైదికసదాచారప్రమాణములచే తెలియదగియున్నది.

మరియును—

శ్లో॥ ఆచారభ్రష్టదేహానాం భవేద్ధర్మపరాఙ్ముఖః.

—పరాశరస్మృతౌ.

అనియుండుటచే సంస్కారాచారదేహులుగాని విప్రులు ధర్మపరాఙ్ముఖులని తెలియవలెను.

మరియును—

శ్లో॥ శ్రోత్రియో విష్ణుభక్తశ్చ గృహస్థ శ్శాస్త్రవిత్తమః

—పరాశరసంహితాయాం.

అనియును—

శ్లో॥ త్రివర్గపూర్వ శ్శ్రోత్రియోఽభివాదన మర్హతి.

అనియుండుటచే చక్రాంకితసంస్కారాచారదేహు లయిన విష్ణుభక్తులగు వైష్ణవులే శ్రోత్రియులైన బ్రాహ్మణులనియును, అట్టి శ్రోత్రియబ్రాహ్మణులే సభయందు వందనార్హ జ్ఞానస్వరూపు లనియు తెలియవలెను.

శ్లో॥ పాషండం పతితం వ్రాత్యం మహాపాతకినం శఠం
నాస్తికంచ కృతఘ్నంచ నాఽభివాదే త్కథంచన.

—పరాశరస్మృతౌ - ఆచారకాండే - ప్రథమాధ్యాయే.

అనుప్రమాణముచే, పాషండులును, మహాపాతకులైన గ్రామయాజక, నక్షత్రయాజకులును, 'వ్రాత్యం' అనగా కానీనులగు శివార్చకులును, నాస్తికులును, కృతఘ్నులును, ప్రథమవందనార్హు లెప్పుడును గారని (నాఽభివాదేత్కథంచన) యను పరాశరస్మృత్యుక్త ప్రకారము శాస్త్రిగారు యాజకాదివృత్తిదోషములుగల తమ బ్రాహ్మణ్యవిషయమై నాఽభివాద్యు లని, బాగుగ తెలియదగి యున్నది.

మరియును—

శ్లో॥ బౌద్ధాన్ పాశుపతాన్ జైనాన్ లోకాయతిక కాపిలాన్
వికర్మస్థాన్ ద్విజాన్ స్పృష్ట్వా సచేలో జలమావిశేత్.

—పరాశరస్మృతౌ - ఆచారకాండే - ప్రథమాధ్యాయే.

శ్లో॥ శైవాన్ పాశుపతాన్ స్పృష్ట్వా లోకాయతికనాస్తికాన్
వికర్మస్థాన్ ద్విజాన్ శూద్రాన్ సవాసా జలమావిశేత్.

—యాజ్ఞవల్క్యస్మృతౌ.

అను ప్రమాణములచే వైదికబ్రాహ్మణులు యాజకాది వృత్తిదోషు లగుటచేత నవైదికాచారమగు శైవాచారమైన భస్మత్రిపుండ్ర రుద్రాక్షస చాక్షురీయత్రిధారులై యుండుటచే నట్టివారు సభాపూజ్యవందనార్హులు గాకుండుటయే గాక స్పృశింపను గూడ పనికిరారని యీ ప్రమాణములచే శాస్త్రిగారు తెలియదగి యున్నది.

మరియును—

శ్లో॥ కపాలకేశభస్మాస్థిశుక్తిపాషాణధారిణం
త్రిపుండ్రధారిణం విప్రం చండాలమివ సంత్యజేత్.

—పరాశరస్మృత్యుత్తరఖండే.

అనియును—

శ్లో॥ దీపాగ్నిం దీపతైలం చ భస్మ చాఽస్థి రజస్వలాం
ఏతాన్ బ్రాహ్మణ స్స్పృష్ట్వా సవాసా జలమావిశేత్.

—వైద్యనాథదీక్షితీయే - ఆహ్నికకాండే, సచ్చరిత్రరక్షాయాం, శంఖస్మృతౌ.

అనియును—

సూ:— కేశకీటానుత్సృజ్య అద్భిః ప్రోక్ష్య భస్మనా వాఽవకీర్య వాచా ప్రశస్తముపయుంజీత.

—వశిష్ఠస్మృతౌ.

అను ప్రమాణములచే భస్మము, త్రిపుండ్రము, రుద్రాక్షధారణము నవకీర్ణులైన శైవుల యాచారమని తెలియుచున్నందున, అట్టి భస్మత్రిపుండ్రరుద్రాక్షధారులైన వైదికులే వికర్మస్థులనియును భస్మమును, రజస్వలాస్త్రీని, ఎముకలను, బ్రాహ్మణుడు ముట్టుకొనగూడదనియు, అట్లు ముట్టుకొన్నచో సచేలస్నానము నాచరింపవలసినదనియు ధర్మశాస్త్రప్రమాణము లుండగా అప్పయ్యదీక్షితకృత తాంత్రిక మీమాంసాన్యాయశాస్త్రమునందు.

శ్లో॥ అన్యథా వైదికానాం తద్దేవసేవా ఉపసంగతా
అత శ్శివద్విజ స్తుల్యో వైదికై స్సర్వకర్మసు.

అని శివసేవాచారము వైదికునకసంగతమనియు వైదికాచారము కాదనియు తెలియుచున్నది.

సూ:—"తతః కర్తా ఊర్ధ్వపుండ్రం కుర్యాత్".
—నిర్ణయసింధౌ - తృతీయపరిచ్ఛేదే- శ్రాద్ధకృత్యనిర్ణయే.

అను సూత్ర ముండుటచేతను.

శ్లో॥ జపే హోమే తథా దానే స్వాధ్యాయే పితృకర్మణి
త త్సర్వం నశ్యతి క్షిప్రం మూర్ధ్వపుండ్రం వినా కృతమ్.
ఇతి హేమాద్రావుక్తేః.

అనియును—

శ్లో॥ యజ్ఞో దానం జపో హోమ స్స్వాధ్యాయః పితృకర్మచ
వృథా భవతి విప్రేంద్ర! ఊర్ధ్వపుండ్రం వినా కృతమ్.
—బృహన్నారదీయే.

అనియును—

శ్లో॥ ఊర్ధ్వంచ తిలకం కుర్యాత్ దైవే పిత్ర్యేచ కర్మణి
ఇతివృద్ధపరాశరోక్తేశ్చ.

అనియును.

శ్లో॥ ఊర్ధ్వపుండ్రం ద్విజాతీనా మగ్నిహోత్రసమో విధిః.
—నిర్ణయసింధౌ.

అని యుండుటచేతను.

శ్లో॥ పూజాకాలేచ హోమేచ సాయం ప్రాత ర్ద్విజాతయః
నామా స్వాచార్య విధినా ధారయే దూర్ధ్వపుండ్రకం.
ఊర్ధ్వపుండ్రం మృదా శుభ్రం లలాటే యస్య దృశ్యతే
చండాలోపి విశుద్ధాత్మా పూజ్యఏవ న సంశయః.
—పరాశరస్మృతౌ - ఆచారకాండే - ప్రథమాధ్యాయే.

అనియును—

శ్లో॥ స్నాత్వా మృత్తికయా చోర్ధ్వపుండ్రం కుర్యాత్ప్రయత్నతః
జపకాలే మృదా కుర్యాత్సంధ్యాకాలేచ వారిణా
భస్మనా హోమకాలేతు చందనం సార్వకాలికం.

యాజుషపూర్వప్రయోగచంద్రికాయాం.

తత్ప్రకారము.

శ్లో॥ గోపీచందన! పాపఘ్న విష్ణుదేహసముద్భవ!
చక్రాంకిత! నమ స్తుభ్యం ధారణా న్ముక్తిదో భవ.

ఇతిమృత్తికా మాదాయ ఇత్యారభ్య.

శ్లో॥ శంఖచక్రగదాపాణే ద్వారకానిలయాచ్యుత
గోవింద పుండరీకాక్ష రక్ష మాం శరణాగతమ్.

ఇత్యం తేన ధ్యాత్వా గృహస్థో లలాటేషు స్థానే ష్వనామికాం గుళ్యా విష్ణుగాయత్ర్యా కేశవాదిద్వాదశనామభి ర్వా ధారయేత్. బ్రహ్మచారీ వానప్రస్థో వా లలాట కంఠ హృదయమూలేషు వైష్ణవగాయత్ర్యా కృష్ణాదిపంచనామభి ర్వా ధారయేత్. యతి స్తర్జన్యా శిరో లలాట హృదయేషు ప్రణవేన ధారయేత్. పరమహంసో లలాటే వైక మూర్ధ్వపుండ్రం ధారయేత్.

—యాజుష పూర్వప్రయోగ చన్ద్రికాయామ్.

అనునట్టి ప్రబలప్రమాణములచే వైదికులగు వారికి పూజాహోమ సాయంప్రాతఃకాలములయందు విధిగా తప్పక ఊర్ధ్వపుండ్రమునే ధరింపవలసినదిగాను, అట్టి ఊర్ధ్వపుండ్ర ధారుడగు చండాలుడైనను పూజనీయుడే ననియు విధిగా నూర్ధ్వపుండ్రమును విధించియున్నను, శాస్త్రిగారు మా వైదికబ్రాహ్మణ్యమునకు భస్మధారణమే ఆచారమను నెడల హోమాదులయందు రుద్రపరమగు మంత్రముచ్చరించి ఆహుతి వేసినవెంటనే (అప ఉపస్పృశ్య) అని హస్త ప్రక్షాళనము చేసికొనవలసినదిగా చెప్పియున్నందునను, తదితర మంత్రోచ్చారణల సమయమందు చెప్పక పోవుటవలనను, రుద్ర

పరమగు భస్మత్రిపుండ్రధారణము శుద్ధశ్రోత్రియముగాదని తమకే తెలియుచున్నది, మఱియు అట్టి రుద్రపరమగు భస్మమును వైదికులగు వారు పై ప్రమాణముల ప్రకారము హోమకాలములయందును గూడ ఊర్ధ్వముగానే ధరింపవలయుననియు, అట్టి హోమకాలమున దప్ప తదితర సర్వకాలమును శ్రీ చందనమును గాని గోపీచందనమును గాని స్మార్తులు ఊర్ధ్వపుండ్రముగానే ధరించవలసినదిగాను శైవులెల్లప్పుడు భస్మమునే త్రిపుండ్రముగా ధరింపవలసినదని వైదిక సదాచార ధర్మశాస్త్ర ప్రమాణములచే శాస్త్రిగారు బాగుగ తెలియదగియున్నది.

మఱియు—

శ్లో॥ నష్టశౌచా మూఢధియో జటాభస్మాస్థిధారిణః
విశంతు శివదీక్షాయాం యత్ర దైవం సురాసవం.

—శ్రీమద్భాగవతే - చతుర్థస్కంధే - తృతీయాధ్యాయే.

అను ప్రమాణముచే భృగుశాపంబున, నష్టశౌచాచార మూఢులై శైవాచారపరులై భస్మత్రిపుండ్రధారులగు వైదికులు, స్వమతవిరుద్ధాచారులగుటవలన, వికర్మస్థత్వముచే, పై ప్రమాణములవలన అట్టి వికర్మస్థులే, వందన పూజ్యార్హులు కారని, శ్రీ పాంచరాత్రమే పరమపూజనీయమైనదని శాస్త్రిగారి వాదమూలమున ఆస్తిక పాఠక మహాశయులు తెలియదగియున్నది.

మఱియు—

ఇట్టి విరుద్ధకర్మస్థులైన యాజకాది వృత్తిదోషులగు బ్రాహ్మణులే సభాపూజ్యులు కారని విచారించక వాదించు శాస్త్రిగారి వాదమశాస్త్రీయమని, బహుధర్మశాస్త్రప్రమాణములచే ఖండించి శ్రీపాంచరాత్రస్వాములే వందన పూజ్యార్హులని శాస్త్రిగారు తెలియదగు ప్రమాణము.

శ్లో॥ ప్రాసాదం దేవదేవీయు మాచార్యం పాంచరాత్రికం
అశ్వత్థంచ వటం ధేనుం తత్సమూహం గురోర్గృహమ్

దూరా త్ప్రదక్షిణం కుర్యా న్నికటా త్ప్రతిపూం విభోః
దండవ త్ప్రణిపాతైశ్చ నమస్కుర్యా చ్చతుర్దిశమ్.
—శ్రీవైష్ణవ లఘ్వాహ్నిక సంగ్రహే - విష్వాయతనే

అను ప్రమాణముచే శ్రీ పాంచరాత్ర ప్రవర్తకులగు శ్రీ వైష్ణవులే సర్వలోక సంపూజ్యులనియు, వందనాహులనియు, నిరూపించి, అట్టి వైష్ణవులైన విష్ణుభక్తులు పుణ్యాత్ములేయనియు, వారి దర్శనముచే పాపహారంబగునని తెలియదగు వాక్యము.

క॥ హరిభక్తులు పుణ్యాత్ములు
పరికింపగ వారిగన్న పాపములణగున్
పరమపవిత్రమగు త
చ్చరణాబ్జపరాగ లేశ సంస్పర్శమునన్.
—శేషధర్మము.

అని ధర్మములుండుటచే శ్రీమహావిష్ణుస్వరూపులగు విష్ణుచిహ్నాంకిత శరీరపావనులైన పాంచరాత్రాదిస్వాములే వందనపూజార్హులని ధర్మశాస్త్రప్రమాణములచే తెలియుదగియున్నది.
మఱియు—

శ్లో॥ చక్రాంకితస్య సాన్నిధ్యే తథా కుర్యా త్ప్రయత్నతః
స్నానం దానం జపో హోమ స్తత్సర్వం చాఽక్షయం భవేత్.
—శ్రీమద్భాగవతే.

అనుటచే విష్ణుచిహ్నాంకితులగు వైష్ణవుల సాన్నిధ్యమందు చేసిన దానము అక్షయఫలం బొసంగునని తెలియుచున్నందున.

శ్లో॥ దైవేషు పిత్ర్యేషు తథా ధర్మార్థే ష్వితరేషుచ
అవైష్ణవం న గృహ్ణీయా త్పాత్రం దానేషు కర్హిచిత్.
—భారద్వాజసంహితాయాం.

అనియుండుటచే వైష్ణవులే దానపాత్రులని తెలియవచ్చుచున్నందున గ్రామయాజక నక్షత్రయాజకాది వృత్తిదోషులగు శాస్త్రిగారెట్లు పూజ్యులో పాఠకమహాశయు లవలోకింపవలసినదైయున్నది.

మరియును —

విశిష్టాద్వైతసిద్ధాంతమునకు ఏకాయన శాఖామూలవేద మగు పాంచరాత్రాగమమే ముఖ్యప్రధానమై యున్నదని, శ్రీపాంచరాత్రాగమ దివ్యశాస్త్రవిషయప్రదర్శినియందు చతుర్థ, పంచమ షష్ఠ, ప్రకరణములయందు శాస్త్రిగారికి తెలియజేయబడియున్నది. అట్టి పాంచరాత్రాగమంబు ఏకాయనశాఖామూలకంబని శాస్త్రిగారు తెలియదగు ప్రమాణము.

ఉత్పత్త్యసంభవాధికరణ శ్రీభాష్యవ్యాఖ్యాశ్రుతప్రకాశికయందు, 698 పుట ఆంధ్రాక్షరకోశము.

సూ॥ ఏకాయనశబ్దస్య ప్రసిద్ధ్యనాదరేణార్థాంతరపరత్వ కల్పన మయుక్తమ్, ప్రసిద్ధ్యపవాదకాభావాత్.

అనువాక్యమునకు పూర్వోత్తరభాగములందు పాంచరాత్రమేకాయనశాఖామూలకంబనుట చక్కగ దెలియజేయబడి యున్నది.

ఆ ప్రకరణమందలి విషయములను పూర్వపక్షులు పండితుల మూలముగ తెలిసికొని తమ డెందమునందు సందియంబును బోగొట్టుకొందురుగాక.

మరియును —

ఏకాయనశాఖామూలకత్వేనాఽన్య ప్రామాణ్య మభ్యుపగమ్యతే, నచైకాయనశాఖాసద్భావే మానాభావః భూమవిద్యాయామేకాయనశాఖాయా అపి:—అధీహి భగవ ఇతి హోపససాద సనత్కుమారం నారదః, తం హోవాచ యద్వేత్థ తేన మోపసీద, తత స్త ఊర్ధ్వం వక్ష్యామీతి. స హోవాచ ఋగ్వేదం భగవోఽధ్యేమి యజుర్వేదం, వాకోవాక్య మేకాయనం దేవవిద్యాం బ్రహ్మవిద్యామ్.

ఇత్యాదినా విద్యాస్థానేషు పరిగణనాత్ (నాగరాక్షర గ్రంథము 135 పుట) అని ప్రతిపాదింపబడి యున్నది. కావున నర్థ

సామ్యముచేతను, ప్రాచీనుల భాషితంబులచేతను పాంచరాత్రం బేకా యన శాఖామూలంబని శాస్త్రిగారు తెలియదగును.

—సుదర్శనసురద్రుమము - ద్వితీయపరిచ్ఛేదము.

మరియును—

శ్లో॥ ఏకాయనే హ్యధికృతా స్సర్వే యాన్త్యంజసా హరిమ్
యేచ నానాపథే ఽన్యత్ర ప్రతిబుద్ధాస్తు కేచన.

—(భారద్వాజ సంహితాపరిశిష్టే - తృతీయాధ్యాయః.)

టీకా॥ ఏకాయనే మూలవేదే అధికృతాః తదుక్తధర్మానుష్ఠాతార ఇత్యర్థః సర్వే హరిం యాన్తి ఏకాయనస్య మోక్షైకలక్షణత్వాత్ తన్నిష్ఠాః సర్వేపి హరిం ప్రాప్నువంతీత్యర్థః.

ఇది మొదలగు నాశ్లోకవ్యాఖ్యానంబును విలోకింపుడు (నాగరాక్షర ముద్రితకోశమున 164 పుట). ఈ మొదలగు బహు ప్రమాణములచే శ్రీవిశిష్టాద్వైతసిద్ధాంతమునకు ముఖ్యాధారభూతమైన శ్రీపాంచరాత్రాగమము ఏకాయనశాఖామూలవేద మని శాస్త్రిగారికి సుస్పష్టము.

అట్టి పాంచరాత్రాగమప్రవర్తక శ్రీవిశిష్టాద్వైతసిద్ధాంత శ్రీమహావిష్ణ్వనుష్ఠాననిష్ఠులై భగవద్దాస్యైకజీవనులైనవారే పరమైకాంతి మహాభాగవతోత్తములగు శ్రీపాంచరాత్రస్వాము లని, విశిష్టాద్వైతమతసిద్ధాంతసాంప్రదాయిక గ్రంథంబున శాస్త్రిగారు తెలియదగు ప్రమాణము.

శ్లో॥ న్యస్తాశేషభర శ్శ్రీశే యస్తు దాస్యైకజీవనః
స ఏష పరమైకాంతీ ద్వావేతౌ వైష్ణవౌ స్మృతౌ.

—శ్రీభారద్వాజసంహితాయాః.

అనుప్రమాణముచే సర్వభరములను శ్రీశునియం దుంచి దాస్యమునే ముఖ్యజీవనముగ జేసికొనియుండువారలే శ్రీపాంచరాత్ర వైష్ణవులు.

అట్టి పాంచరాత్ర మహాభాగవతోత్తములే భగవత్ప్రాప్తిని నిలిపినవారనియు, శ్రీమన్నారాయణునికి ప్రాణరక్షకులైనవారనియు, వారు వేంచేసినచోటు పరమపవిత్రత బొందునని అర్థపంచకమునందు, దేశికులఅభిప్రాయ ప్రమాణము: ఆర్తులు, జిజ్ఞాసులు, అర్థార్థులు, జ్ఞానులు, అను చతుర్విధపురుషుల కాశ్రయనీయుడై ధర్మార్థకామమోక్షము లనెడి చతుర్విధపురుషార్థఫలప్రదుడై, విలక్షణ విగ్రహాయుకుడై, శ్రీలక్ష్మీభూనీళానాయకుడై, షడ్గుణైశ్వర్యసంపన్నుడైన శ్రీమన్నారాయణునికి ప్రాణరక్షకులై పరసమృద్ధ్యైకప్రయోజనులై, అవతరించిన భగవద్గుణైకధారకులై యుండెడి మహాభాగవతోత్తముల జన్మవృత్తాదులు దివ్యలీలలుగా దలచి, వారి కృపకు పాత్రులై సదాచార్య విగ్రహధ్యానార్చనప్రణామాదికైంకర్యములు సదానుష్ఠానముగా నుండెడి మహాత్ములు సకలలోకపుణ్యులు, సర్వజీవదయాపరులు, శాంతశమదమాద్యనంత కళ్యాణగుణ పరిపూర్ణులు, అపారదయాసముద్రులు, వారు వేంచేసిన చోటును, హస్త ముంచినచోటును తలచినచోటును, పరమపవిత్రత బొందినిర్భయులై యుందు రని యెంబెరుమనారులు తమ దివ్యగోష్ఠిలోనున్నవారలకు అత్యంతకృపచేత నానతిచ్చి యున్నందున—

శ్లో॥ ప్రసాదం దేవదేవీయ మాచార్యం పాంచరాత్రికం
అశ్వత్థం చ వటం ధేనుం తత్సమూహం గురోర్గృహం
దూరా త్ప్రదక్షిణం కుర్యా న్నికటా త్ప్రతిమాం విభోః
దండవ త్ప్రణిపాతైశ్చ నమస్కుర్యా చ్చతుర్దిశమ్.

—శ్రీవైష్ణవలఘ్వాహ్నికసంగ్రహే - విష్ణ్వాయతనే.

అనునట్లు సంప్రదాయకాచార్యులైన శ్రీపాంచరాత్రాచార్యులు వందనపూజ్యార్హులని విశిష్టాద్వైత మతస్థాపనాచార్యులగు దేశికులవారి అభిప్రాయ మిట్లుండగా విశిష్టాద్వైత పరమైన తాంబూలమును గురువులు వారుగా వచ్చు శ్రీవైష్ణవు లనువారు గ్రహింపవలసినదేగాని పాంచరాత్రులు అధికారపూజ్యులు కారను

నక్షత్రియాజక శ్రేష్ఠులైన శాస్త్రిగారి దుర్వాదము అశాస్త్రీయమని అసంగతమని తెలియుచున్నది.

ఇట్టిదుర్వాదము నిర్వాద మగునట్లుగా, విశిష్టాద్వైతసిద్ధాంత ప్రథమాచార్యులగు శ్రీమన్నాథమునిచే నుత్పత్తిచేయబడిన శ్రీ పాంచరాత్రాగమ శాస్త్రము విశిష్టాద్వైత సిద్ధాంతమునకు ముఖ్య కారణమై యున్నందున, అట్టి విశిష్టాద్వైతులగు వైష్ణవులందరు శ్రీ పాంచరాత్రాగమశాస్త్రసిద్ధాచారపరులే యుని శ్రీమద్రామానుజా చార్యుల వారిచే నియమింపబడిన 74 పీఠముల వారు రొప్పుకొనుచుం డగా, శాస్త్రిగారేల యొప్పుకొనరో! అయినను ధర్మశాస్త్రప్రమా ణములు అందరికి ఒప్పిదమేగదా. ఇట్లు శ్రీవైష్ణవులలో పరమైకాంతి మహాభాగవతులుగా ఏకాయన శాఖావేదప్రవర్తకులై యుండుట వలన పాంచరాత్రులని వేరుగా వాడుటయేగాని, శ్రీవైష్ణవులనువారం దరు శ్రీపాంచరాత్రస్థులేయనియు, వీరందరు సర్వసమానవందన పూజ్యాధికారులనియు, వీరికి విష్ణ్వారాధనమే ముఖ్యప్రధాన మని శాస్త్రిగారు విశిష్టాద్వైతమత సిద్ధాంతప్రవర్తకులైన సదాచారో పదేశమున తెలియదగు ప్రమాణము.

శ్లో॥ వైష్ణవో విష్ణుయజనం నిత్యమేవం సమాచరేత్.

— శ్రీపాంచరాత్ర శ్రీధరసంహితాయామ్.

అనియు—

శ్లో॥ దీక్షితాః పంచసంస్కారైః పంచకాలపరాయణాః
ఆత్మార్థం వా పరార్థం వా నిత్యం హరి ముపాసతే.

— శ్రీపాంచరాత్ర ఖగప్రశ్నసంహితాయామ్.

అని ఇత్యాది ప్రమాణములచే సాత్వతి బ్రాహ్మణోత్తము లైన శ్రీవైష్ణవులకు విష్ణ్వారాధనము స్వాభావికస్వమతానుష్ఠానం బైయున్నదని తెలియదగియున్నది.

మరియు—

శ్లో॥ శృణుధ్వం మునయ స్సర్వే వేద మేకాయనాభిధం
పాంచరాత్రం మూలవేదం సాత్వతం తంత్ర మిత్యపి

భగవచ్ఛాస్త్ర మితీ త న్నామభిః పరిపఠ్యతే
మోక్షాయనాయ వై పంథా ఏతదన్యో న విద్యతే
తస్మా దేకాయనం చేతి ప్రవదంతి మనీషిణః.

— పురుషోత్తమ సంహితాయామ్ - వశిష్ఠప్రతివచనం.

అను ప్రమాణముచే శ్రీపాంచరాత్రాగమశాస్త్రము, సాత్వతతంత్ర మనియు, మోక్షఫలప్రదంబైనదనియు, ఏకాయన శాఖామూల వేద మనియు, భగవచ్ఛాస్త్ర మనియు, నామాంతరములచే నొప్పుచున్నది.

ఇట్టి శ్రీపాంచరాత్రాగమోక్త భగవ ద్రిక్షారాధనపరులై యున్నవా రందరు శ్రీవైష్ణవులేయనియు, అందు శ్రీపాంచరాత్రాచార్యులను వారు భగవదర్చారూపావిర్భావస్వరూపులైన శ్రీనివాసులే ప్రథమాచార్యావతారులైన వారనియు, స్వయమాచార్యులే యనియు మతసిద్ధాంతప్రమాణములచే శాస్త్రిగారు తెలియదగు ప్రమాణము.

శ్లో॥ మమ స్వరూపం సర్వస్మా త్పరస్య జగదీశితుః
షడ్విధం పరిపూర్ణం త త్సేనశ పరిపఠ్యతే.

— భారద్వాజ సంహితాయాం - ప్రథమాధ్యాయే.

అనియు —

శ్లో॥ పరత్వం వ్యూహవిభవ మంతర్యామిత్వ మేవచ
అర్చాచార్యావతారా ద్వా షడ్విధ్యం మే ప్రకీర్తితమ్.

అను ప్రమాణములచే ఆచార్యస్వరూపము శ్రియఃపతి యొక్క షడ్విధస్వరూపములలో నారవదియగు శ్రీమద్రామానుజ రూపంబున నవతరించుటచే శ్రీగురుభ్యో నమః "హరిః ఓ" మ్మని యును, (ఆచార్యో లబ్ధ వేదార్థం బని) తద్ద్వారా సమస్త వేదార్థంబుల తెలిసికొనవలయుగాన గురుస్వరూపంబైన భగవద్రూపమునుండియే సమస్తవేద వేదార్థములు లభించియున్న వగుటచే (సర్వేషాం ప్రథ మాచార్యం శ్రీనివాస మహం భజే" యనినవారై.)

శ్లో॥ అభ్యర్థితో జగద్ధాత్ర్యా శ్రియా నారాయణ స్స్వయం
ఉపాదిశ దిమం యోగ మితి మే నారదా చ్ఛ్రుతం.
—భారద్వాజ సంహితాయాం.

అని స్వయముగా శ్రీమన్నారాయణుడే ప్రథమాచార్యులై శ్రీ భూనీళలకు శ్రీపాంచరాత్రశాస్త్ర మనుగ్రహించి పురుషార్థము నంతయు శ్రీదేవియం దనుగ్రహించుటచే నిది శ్రీవైష్ణవ మనుటకు కారణమైయున్నది. అట్టి శ్రీ సంప్రదాయకమునకు మూలపురుషుడైన శ్రీమన్నారాయణ మూర్తియే, ఏకాయనులు-(ఛాందోగ్యోపనిషత్) "వాకో వాక్య మేకాయనం వేదవిద్యాం బ్రహ్మవిద్యాం" అని తెలియుచున్నందున బ్రహ్మజ్ఞాన సంపత్తియైన భగవద్దీక్షారాధనము ఏకాయన శాఖామూలకమనియు, అట్టి వేదప్రవర్తకులు శ్రీపాంచరాత్రాది వైష్ణవాచార్యులే యనియును అట్టి శ్రీపాంచరాత్రాగమ భగవద్దీక్షారాధన ప్రపన్న ధర్మమును భగవదనుజ్ఞయా శఠగోపనాథ యామున రామానుజాచార్యాది ఆళ్వారాచార్యులుగా నవతరించి యీ కలియుగంబున స్థాపించిరి. అట్టి పాంచరాత్ర ధర్మప్రవర్తకులైన శ్రీమద్రామానుజాచార్యులవారిచే నియమింపబడిన 74 పీఠములవారివలెను ఆచార్యాధికార మున్నదగుటచే పాంచరాత్రులు వేరు, శ్రీవైష్ణవులు వేరు గాదనియు అందరు శ్రీపాంచరాత్రవైష్ణవులే యనియును ఆచార్యశబ్దమునందు భేద మెట్లు లేదో అట్లే అర్చకులైన శ్రీపాంచరాత్రులును అయ్యవార్లంగారుగా వచ్చు శ్రీవైష్ణవులును ఒక్కటేననియు, వీరిలో భేద మెంత మాత్రమును లేదనియును అందరు సర్వసమానాధికార సంపూజ్యార్హులే యని విశిష్టాద్వైతసాంప్రదాయక సదాచార ధర్మంబులచే తెలిసికొని శాస్త్రిగారు శ్రీపాంచరాత్రస్వాములు దేవలకు లని దుర్వాదపడు తమ దుర్వాదనిర్వాదు లయ్యెదరుగాక.

అట్టి శాస్త్రిగారి దుర్వాదనిర్వాదమగునట్లుగా ఖండింపం బడిన శ్రీపాంచరాత్రాగమ దివ్యశాస్త్ర విషయప్రదర్శనియందలి ప్రబల ప్రమాణములచే శ్రీపాంచరాత్రము సర్వోత్కృష్టతమ మైనదిగా

పరమవైదిక ఆస్తిక పాఠకమహాశయులు పఠించి సేవింపదగిన దని నా విజ్ఞప్తి.

శ్లో॥ వేదవేదాంగ తత్త్వజ్ఞో వేదాంతపరినిష్ఠితః
మీమాంసాన్యాయనిపుణో ధర్మశాస్త్రవిశారదః.

శ్లో॥ ఇతిహాసపురాణజ్ఞో పాంచరాత్రార్థతత్వవిత్
పరం భగవదైకాంత్యమ్ జ్ఞాత్వా ధర్మం సమాచరేత్.
—భారద్వాజ సంహితాయాం.

తాత్ప:— వేద, వేదాంత, మీమాంస, న్యాయ, ధర్మ, స్మృతి, ఇతిహాస, పురాణ, పాంచరాత్ర, శాస్త్రార్థంబుల వాస్తవస్థితి బక్కాగా నెరిగి, ధర్మార్థవిషయములందన్నిట భగవదారాధనారాధ్య భగవత్స్వరూపంబులే నిరూపితంబు లని నిర్ణయించుకొనియే ధర్మముల నాచరింపవలయు నని శ్రీపాంచరాత్రవిషయమై దుర్వాదపడు శాస్త్రిగారు విశిష్టాద్వైతమతసిద్ధాంతధర్మమును బాగుగ తెలియగల రని ప్రార్థితులు.

స్వస్తిశ్రీ సమస్త సన్మంగళాని భవంతు.

ఇది శ్రీపాంచరాత్రాగమ దివ్యశాస్త్ర విషయప్రదర్శనియందు
చతుర్దశ ప్రకరణము సర్వంబును
సంపూర్ణము.

ఇట్లు పరిష్కారపండితులు:

శ్రీమాన్ - ఉభయవేదాంత, శ్రీమచ్ఛ్రీరంగం, నల్లాన్
చక్రవర్తుల శ్రీనివాస రఘునాథాచార్యులు
అయ్యవార్లంగారు—
మోటూరుగ్రామము, గుడివాడ తాలూకా.



శ్రీరస్తు.

# శ్రీపాంచరాత్రాగమదివ్యశాస్త్రవిషయప్రదర్శని

అను

# తాంబూలదుర్వాదఖండనము

## ప్రథమాధ్యాయప్రారంభః.

### శ్రీపాంచరాత్రోత్పత్తివిషయము.

శ్లో॥ వందే లక్ష్మీపతిం దేవం శంఖచక్రగదాధరం
విద్యామూర్తిం హయగ్రీవం శబ్దార్థజ్ఞానలబ్ధయే.
అమృతాధ్మాతమేఘాభ మమృతాహరణం విభుం
పాంచరాత్రాగమాచార్యం వందే వైకుంఠభూపతిం.
నమో జగన్నివాసాయ వాసుదేవాయ సాక్షిణే
నిర్గుణాయ పరవ్యోమ్ని కమలాఙ్కితవక్షసే.
మహర్షయః పురా కేచిత్ బ్రహ్మ జిజ్ఞాసితు మ్మహీం
పర్యటన్తో మహర్షీణా మగ్నిహోత్రేణ జుహ్వతాం.
పుత్రదారైస్సమేతానా మాశ్రమానపి సర్వశః
గత్వా తత్ర స్థితాః పూర్వం నమస్కృత్య యథాక్రమం.
పప్రచ్ఛుః కేన శాస్త్రేణ బ్రహ్మజ్ఞానం భవిష్యతి
ఆరాధనం భగవతః కర్తు మిచ్ఛామహే వయం.
తత్కర్మ కేన శాస్త్రేణ కర్తవ్యం భగవత్ప్రియం
తత్సర్వం బ్రూత మునయ స్సంసారాబ్ధినిమజ్జతాం.
ఇతి పృష్టేషు తేష్వేకః కహోళో నామ వై మునిః

తా॥ పూర్వమందు మహాఋషీశ్వరులు యావన్మందియు బ్రహ్మజిజ్ఞాసులై, లక్ష్మీపతియు, శంఖచక్రగదాధరుడును, జగన్నివాసుడును, వైకుంఠనాథుడును, శ్రీపాంచరాత్రాగమాచార్యులును,

సర్వసాక్షియును, నిత్యవిభూతివాసులునగు శ్రీమన్నారాయణునికి నమస్కరించినవారలై పుత్రదారాదులతోసహా సర్వాశ్రమములను తిరిగి తిరిగి, కహోళుడను మహాముని యాశ్రమమునకు వెళ్ళి, యా కహోళునకు నమస్కరించి 'మహాప్రభో! యేశాస్త్రమువలన బ్రహ్మజ్ఞానము కలుగునో, యే శాస్త్రము భగవదారాధనను జెప్పుచున్నదో, యేవిధముగా తదారాధనకర్మ చేయవలెనో, ఆ విధిని యావత్తు సంసారార్ణవమగ్నులమైన మాకు తెలియ చెప్పవలసిన'దని ఆ ఋషు లందఱు దీనులై వేడిరి.

కహోళః—

శ్లో॥ వయం తు కర్మకాండోక్త కర్మబ్రహ్మైవ వేదినః.
ఉపాస్మహే విష్ణుమేవ హ్యగ్నిహోత్రాదిరూపిణం (8)

తా॥ 'కర్మసముదాయమందు చెప్పబడినటువంటి కర్మయే బ్రహ్మస్వరూపమని గుర్తెఱుగుచున్నవారలమై అగ్నిహోత్రస్వరూపమైనటువంటి శ్రీమహావిష్ణువును మనము సేవించుచున్నాము' అని చెప్పెను.

మునయః—

శ్లో॥ కో వా జానాతి తద్విద్యాం ప్రష్టే ష్వేవ మహామునిః.
కహోళో వచనం శ్రుత్వా మునీన్ స్తా నిద మబ్రవీత్
బ్రహ్మవిద్యాప్రాప్త్యుపాయం శృణుధ్వం మునిపుంగవాః!
మేరో రుత్తరతః పార్శ్వే సిద్ధగంధర్వసేవితే
సిద్ధాశ్రమే బ్రహ్మసుతో ఏకతో నామ వై మునిః.
స తు శ్రీశాం ద్వాష్టవాం సచ్ఛాస్త్రమి త్యనుశుశ్రుమ
ఇతి తస్య వచ శ్శ్రుత్వా సమస్కృత్య ప్రతస్థిరే.
గత్వా మేరుం సమాసాద్య ప్రణేము స్తం మహామునిం
ఆగతా న్నేకతో దృష్ట్వా సంపూజ్య తదనంతరం.
స్వాగతాదిపరిప్రశ్నైః కందమూలఫలాదిభిః
తృప్తాం స్తా న్నేకతో వాక్య మిద మాహ తపస్వినః.
మదనుగ్రాహ్యా మునయ! ఆగతా నాత్ర సంశయః
అథాపి బ్రూత వః కార్యం కి మ్మత్తః ప్రాప్తు మిచ్ఛథ.

ఇతి తస్య వచ శ్శ్రుత్వా మునయో హృష్టమానసాః
సర్వే ప్రాంజలయః స్థిత్వా నమస్కృత్య యథావిధి.
భగవన్! పృథివీం సర్వా మటామో బ్రహ్మణస్సుత!
అధీతా బ్రహ్మవిద్యా వై జ్ఞాతా తస్య న లభ్యతే.
కహోళవచసా త్వాం వై జ్ఞాత్వా వయ మిహాగతాః
త్వం బ్రహ్మవిద్ బ్రహ్మసుత! సర్వశాస్త్రార్థసారవిత్.
తపసా చ సుతప్తేన దృష్టవాంశ్చ శ్రియఃపతిం
తస్మా చ్ఛాస్త్ర మధీతం యత్త దాదిశ మహామునే!
ఆర్తానాం సంస్పృతే ర్భీతిం ప్రాప్తానాం నో భవా న్గతిః. 18

తా॥ అట్టి విద్యను తెలిసినవా రెవరు? వా రెక్కడ నున్నారు? అని మహఋషు లందఱు నడుగగా, అప్పుడు కహోళమహాఋషి ఆ వాక్యములను విని వారలనుగుఱించి చెప్పిన దేమనగా, ఓమునులారా! బ్రహ్మవిద్యాప్రాప్తికి నుపాయమును చెప్పుచున్నాను వినుడు. మేరువు యొక్క యుత్తరభాగమునందు ఏకతుడనే పేరుగల బ్రహ్మపుత్త్రుడు కలడు. ఆ మునిని శ్రీమహావిష్ణువల్ల అట్టి బ్రహ్మవిద్యాశాస్త్రమును పొందబడినటువంటి వానినిగా వినుచున్నాము అని కహోళుడు చెప్పెను. ఆ వృత్తాంతమును విని ఋషు లందరు బయలుదేరి మేరువు యొక్క యుత్తరమందున్న ఆ ఋషియొద్దకు వెళ్లి స్తోత్రము చేసిరి. ఇట్లు వచ్చి స్తోత్రము చేయుచున్న ఋషులనుచూచి వారియొక్క క్షేమములను ప్రశ్నించి, వారిని పూజించి, ఆ ఋషులనుగురించి పలుకుచున్నాడు. ఏమనగా 'ఓఋషులారా! నాయందు మీకు గల ప్రీతిచేత వచ్చినవార లైరి గనుక నేను సంతుష్టాంతరంగుండనైతిని. మీరు వచ్చినకార్యమును తెలుపవలసిన దని బ్రహ్మపుత్త్రుడగు ఏకతు డడుగగా, ఆ ఋషీశ్వరులు సంతోషించినవారలైఆయనకు నమస్కరించి, హేమహర్షీ! బ్రహ్మవిద్యాప్రాప్తినిగురించి తెలిసికొందమని భూమండలమును కలయ దిరుగుచు నెచ్చటను లభ్యముగాక, ఆ బ్రహ్మవిద్యోపదేశకర్తలు మీ రని కహోళునివల్ల విని మిమ్మును సేవించితిమి. మీరు సర్వబ్రహ్మవేత్తలు, బ్రహ్మపుత్త్రులు, తపోమహిమచే శ్రీమహా

విష్ణువును సాక్షాత్కరించుకున్నవారలు గనుక ఆ శాస్త్రమును మాకుపదేశింపవలసినది. బ్రహ్మవిద్యావిషయమై ఆర్తులమైనటువంటి మాకీ సంసారభీతి యెట్లుగా తొలగునో అట్టి బ్రహ్మవిద్యామార్గమునుపదేశింపవలసిన దని ఆ ఋషులు అడిగిరి. 18

శ్లో॥ ఇతి తేషాం వచ శ్శ్రుత్వా హరే ర్వాక్య మనుస్మరన్
తా నాహ భగవద్భక్తా నేకతో భగవత్ప్రియః
మహార్షయః! స్వాగతం వో వింధ్యశైలనివాసినః
బహోః కాలా ద్భగవత శ్చాదేశం మనసా స్మరన్.
యుష్మాకం దర్శనాకాంక్షీ మేరౌ వాస మకల్పయమ్
మద్భాగ్యా ద్భగవా నద్య వాసుదేవ స్సనాతనః.
యుష్మాక మ్మానస మనుప్రవిశ్య ప్రేషయ త్స్వయం
త దద్య సఫలం జన్మ భవతాం జ్ఞానదానతః
శ్రీనికేతపదం లప్స్యే భక్తసూరినిషేవితం
ఆదౌ యుగే యథా శ్రీశా ద్బ్రహ్మజ్ఞాన మవాప్తవాన్.23

తా. ఈ ప్రకారముగా పలికిన ఆ ఋషుల వాక్యములను బ్రహ్మపుత్రుడగు ఏకతుడు విని వారలయందు అనుగ్రహముకలవాడై ఆ శ్రీ మహావిష్ణువుయొక్క యుపదేశవాక్యములను స్మరించుచున్నవాడగుచు, ఓ మహాఋషులారా! వింధ్యనివాసులైన మీరందరు సుఖముగా నున్నారుగదా. బహుకాలమునకు భగవంతునియొక్క ఆజ్ఞను స్మరించుచున్నవాడనౌచు, మీయొక్క దర్శనము కోరుచున్నవాడనై మేరువుయొక్కయుత్తరభాగమందు వసించియుంటిని. నాభాగ్యవశమున శ్రీమహావిష్ణువు మీయాత్మలయందు ప్రవేశించి స్వయముగా మిమ్ములను నిచ్చటికి జ్ఞానవిద్యకొఱకు పంపెను. అందువల్ల (ననగా జ్ఞానవిద్యాదానమువల్ల) నాజన్మము సఫలమైనది. ఈ హేతువువల్ల భక్తులచేతను, విద్వాంసులచేతను, నిత్యసూరులచేతను సేవింపబడు విష్ణుపదమును పొందగలను. 23

శ్లో॥ తత్క్రమేణైవ వక్ష్యామి శృణుధ్వం మునిపుంగవాః!
వయంతు బ్రహ్మణః పుత్రా ఏకతశ్చ ద్వితః స్థితౌ. 24

తేష్వహం ప్రథమో నామ్నా ఏకతో మునిపుంగవాః!
సంసారాఽసారతాం జ్ఞాత్వా మేరో రుత్తర మాశ్రితః
శ్రీపతిం హరి ముద్దిశ్య తపామి స్మ సుదారుణం
తతో వర్షసహస్రాంతే భగవాన్ భక్తవత్సలః
దర్శయామాస చాత్మానం శ్రియా సహ జగత్పతిః
దృష్ట్వోత్ఫుల్లమనా దేవం దేవీం చ తదను శ్రియం
ఆనందసాగరే మగ్న స్తతోఽస్తావం హరిం శ్రియం
నమః పద్మపలాశాక్ష! నమ స్తే పీతవాససే
నమో విశ్వాత్మనే తుభ్యం సృష్టిస్థిత్యంతకారిణే
అరూపాయ సురూపాయ సచ్చిదానందమూర్తయే
నమో హిరణ్యగర్భాదిసృష్టి బ్రహ్మస్వరూపిణే
కారుణ్యాబ్ధయే తుభ్యం భక్తానుకంప్యయా
మత్స్యాద్యనేకరూపాణాం ధారిణే వనమాలినే
క్షీరోదమథనోద్భూతే! జగదానందదీక్షితే!
నమః పంకజమాలిన్యై నమస్తేఽమృతయోనయే
త్రైలోక్యమాత శ్చరణం ప్రపన్నోస్మి చ నామహం
ఇతి సంస్తూయమానంతు శరణ్యో భక్తవత్సలః
నారాయణ స్సత స్తుష్ట శ్శ్రియా సహ జగత్పతిః
మునే! తుష్టోస్మి భద్రం తే తపసా దుశ్చరేణ తే
మత్తో వృణీష్వ వరదా ద్వర మిత్యబ్రవీ త్తదా
హరే స్తస్య వచ శ్శ్రుత్వా కృతాంజలిపుటో బ్రువన్
జన్మకోటిసహస్రాణి మయాఽవాప్తాని వై హరే
అత స్సంసారజలధే రుత్తీర్య భగవ న్హరే
శ్రుతిస్మృతీతిహాసాద్యైః ప్రోక్తం విష్ణోః పరం పదం
యత్ర స్థితానాం భక్తానా మావృత్తి ర్న భవే త్కిల
నయ మా న్తత్పదం దేవ! భీతం సంసారసాగరాత్
ఏష మేఽస్తు వరః కామో నాన్యం కించి ద్వృణే హరే!
ఇతి సంప్రార్థ్యమానం మాం భగవా న్ప్రత్యభాషత.
మునే! దదామి మత్స్థాన మపునర్భవలక్షణం

అథాపి కించి ద్వక్ష్యామి తచ్ఛృణుష్వ మహామునే!
ఇయం శ్రీపుష్కరాఖ్యా చ్ఛాస్త్రం లోకస్య హితకామ్యయా
అర్థైష తపస్సందేశాయ కంచి దన్వేషతే మునిం
తస్య పాత్రం భవానేవ తదధీతాం శ్రియో ముఖాత్
కించ త్వాం కతిచి త్కాలా దాగచ్ఛంతి మహర్షయః 41
వాశిష్ఠాదిషు గోత్రేషు హ్యుత్పన్నా శిక్షితా మయా
గచ్ఛ ఏవచ తేషాం త్వమిదం శాస్త్ర ముపాదిశ
తతో మల్లోక మాసాద్య మోదంతా న్నిత్యసూరివత్
ఇత్యుక్త్వా శ్రియ మాలోక్య [illegible]నయే త్వ ముపాదిశ
నారాయణముఖోద్గీతం శ్రుత్వా శ్రీ ర్మునిపుంగవాః!
ఉపాదిశ త్పాంచరాత్రం శ్రీప్రశ్న మితిసంజ్ఞకం
అధీత్య చ శ్రియో వక్త్రా త్తచ్ఛాస్త్ర మఖిలం శుభం
ప్రదక్షిణనమస్కారా న్కృత్వా తచ్ఛాస్త్రవర్త్మనా
పూజామపిచ కృత్వా మాం ప్రస్థితో మథో నారిః
ఉపదిష్ట మిదం శాస్త్రం పావనం మోక్షదం పరం
నాభక్తాయ సకామాయ నచ మద్వేషిణే స్త్రియై
న తస్కరాయాస్త్వజవే నోపదేష్టుం త్వ మర్హసి
ఇత్యుక్త్వాఽంతర్హితో దేవః శ్రియా సార్ధం జగత్పతిః
తేషు గోత్రేషు చోత్పన్నా బ్రూత యూయ మ్మహర్షయః

వేదశిరాః—

భరద్వాజో వశిష్ఠశ్చ విశ్వామిత్ర స్తథాపరః
కౌండిన్యశ్చాపి మునయో హ్యస్మద్గోత్రప్రవర్తకాః
అహం వేదశిరానామా భార్గవోఽయం మరీచిపః
అస్యనామాతు కవషశ్చత్వారో భగవత్ప్రియాః
గర్భదీక్షాం హరేః ప్రాప్త స్తస్మా న్మోక్షైకచింతకాః
శిష్యతాం సముపప్రాప్తా ననుగృహ్ణాతు నో భవాన్
శ్రీప్రశ్న మితి యచ్ఛాస్త్రం శ్రియో వక్త్రా త్త్వయా శ్రుతం
మోక్షదం సర్వశాస్త్రార్థసార మారాధనాదికం
తచ్ఛాస్త్రవిధినా శ్రీశ మారాధ్య శ్రీపతేః పదం

ప్రీత్య మోదామహే సర్వే వయం సూరిభి రంజసా
ఇతి సంప్రార్థితో విద్వా నేకత శ్శ్రీపతి స్సమన్
శ్రియా చ మనసా ధ్యాత్వా తేభ్యో వక్తుం ప్రచక్రమే. 54

తా. కనుక క్రమముగా ఆ విధానమును చెప్పెదను విన వలసినది. నేను బ్రహ్మపుత్రులలో మొదటివాడను. ఈ సంసారమును అసారమైన దానినిగా తెలిసికొని శ్రీ మహావిష్ణువునుగురించి వెయ్యి దివ్యవర్షములు ఘోరమైన తపస్సు గావించితిని. అంతట లక్ష్మీసహితుడై శ్రీ మహావిష్ణువు దర్శనమిచ్చెను. అంతట నేను అనేకవిధములుగా స్తోత్రముచేయుగా నాయందు దయగలవాడై వరము నిచ్చెదను కోరుమని ఆజ్ఞాపించెను. అంతట నేను కృతాంజలినై స్వామీ! ఇదివరకు నేను అనేక జన్మలను పొందితిని. ఈ సంసారమును దాటి నీ పదమును పొంది పునరావృత్తిలేని సులభోపాయమును అనుగ్రహించుటయె నాకు వరమనియు, అన్యవరము అక్కరలేదనియు కోరితిని. అప్పుడు భగవానులు నాయందు దయగలవారై, ఓ వత్సా! కొద్దిమార్గమును, లోకమునకు హితవైనదియు సులభమైన మార్గమొకటి కలదు. అట్టి మోక్షవిద్యను లక్ష్మికి ఉపదేశించితిని. ఆ విద్య నుపదేశించుటకు తగిన పాత్రుని లక్ష్మి కోరుచున్నది. నీవు ఆ విద్యకు తగినవాడవు గనుక నీవు నా భార్యవల్ల ఆ మోక్ష విద్యను ఉపదేశమును పొందవలసినది. కొంతకాలమునకు వశిష్ఠమహాముని మొదలగు నా గోత్రికులైన మహాఋషులు దీక్షితులై నీవద్దకు రాగలరు. వారికి నీవు ఈ విద్య నుపదేశించవలసినది. ఆ ప్రకారము ఆ మహాఋషుల కుపదేశించి నీవు నిత్యశూరులవలె నా లోకమును పొందియుండవలసినదని చెప్పి అంతట లక్ష్మిని గూర్చి ఓ ప్రియురాలా! యీ ఋషీశ్వరునికి మదారాధనరూపమగు ఆ మోక్ష విద్య నుపదేశింపుమా! యని ఆజ్ఞాపించెను. ఈ ప్రకారముగా శ్రీమన్నారాయణునివల్ల ప్రకాశింపబడినటువంటి శ్రీ పాంచరాత్ర శాస్త్రమున శ్రీప్రశ్నయను సంజ్ఞ కలిగినటువంటి యీ భగవదారాధనరూపమగు మోక్షవిద్యను లక్ష్మీప్రసాదమువల్ల విని నమస్క

రించెను. ఇట్లు లక్ష్మీదేవివలన పొందిన యీ మోక్షవిద్యను భక్తుడు గాని వాని కొఱకును, కోరిక లేనివానికొఱకును, నాకు ద్వేషిగా నున్నవానికొరకును, స్త్రీలకొరకును, దొంగలకొరకును, అయోగ్యులకొఱకును, నీ వుపదేశించవద్దని భగవానులు ఆజ్ఞ సాయించి అంతట లక్ష్మీసహితుడై శ్రీమన్నారాయణుడు అంతర్ధానము నొందెను.' అని యీ ఋష్యాదులకు బ్రహ్మపుత్రుడు చెప్పి, ఓ ఋషులారా! మీరు ఏ గోత్రికులో చెప్పవలసినదని బ్రహ్మపుత్రుడగు ఏకతుడు ప్రశ్నింపగా, వేదశిరుడను ఋషి చెప్ప నుపక్రమించెను. ఏమనగా, భరద్వాజ వశిష్ఠ విశ్వామిత్ర కౌండిన్య మహాఋషులు మా గోత్రప్రవర్తకులు. నేనును, భార్గవుడును, మరీచియును, కవషుడును, కశ్యపుడును, వీరలము భగవత్ప్రియులము; గర్భదీక్షాపరులము; విష్ణుపదప్రాప్తులముగా తెలిసికోవలసినది. మమ్ములను శిష్యులుగా అనుగ్రహించవలసినది. ఏ శ్రీ ప్రశ్నశాస్త్రమనే భగవదారాధనరూపమగు మోక్షవిద్యను లక్ష్మీదేవివలన నుపదేశమును పొందినావో, అట్టి విద్యను మా కుపదేశించితివేని మేము మోక్షమును పొందెద మని ప్రార్థించిరి. అనంతరము ఆ విద్యను పొంది సమ్మోదించిరి. 24—54

ప్రథమాధ్యాయము సంపూర్ణము.



శ్రీ ర స్తు.

# శ్రీపాంచరాత్రాగమదివ్యశాస్త్రవిషయప్రదర్శిని

అను

# తాంబూలదుర్వాదఖండనము.

ద్వితీయాధ్యాయప్రారంభః.

శ్రీ పాంచరాత్రోక్తశ్రీవిషయాః.

శ్రీప్రశ్నసంహితాయాం—

శ్రీరువాచ.

శ్లో॥ జగత్కారణ! పద్మాక్ష శంఖచక్రగదాధర
బ్రహ్మరుద్రాదిదేవేశ్య సృష్టిస్థిత్యంతకారణ
అనాదిమధ్యనిధన భక్తవత్సల సద్గుణ
పృచ్ఛామి సంశయం కించిత్తన్మే వ్యాఖ్యాతుమర్హసి. 2

తా॥ బ్రహ్మరుద్రేంద్రాది సర్వదేవతలచేత సేవింపబడుచున్నవారలై సృష్టిస్థితిలయాదిజగత్కారణభూతులై, పద్మములవంటి నేత్రములుగలవారలై, శంఖచక్రగదాధరులై, ఆదిమధ్యాంతరహితులై భక్తవత్సలులై వేంచేసియున్న హేమహాప్రభో! నాకు గల సంశయమును అడుగుచున్నాను చెప్పవలసినదని శ్రీ మహాలక్ష్మి భగవానులను యాచించెనుసుమా యని మహాఋషులకు బ్రహ్మపుత్రుడు చెప్పెను. 2

శ్లో॥ కర్మాణి జంతూన్ సర్వేశ! న త్యజంతి కదాచన
జన్మనోపిచ కర్మాణి ప్రకృతిం ప్రాప్య నిత్యశః. 3

తా॥ హేస్వామీ! కర్మలు జీవులను నెప్పుడును విడిచిపెట్టవు గదా! ప్రకృతిని పొంది కర్మలు, కర్మలను అనుసరించి జన్మలు ఎప్పుడును కలుగుచుండును. 3

శ్లో॥ మాయా తు ప్రకృతి ర్నామ త్వయా సృష్టా జగత్పతే!,
బ్రహ్మాదిప్రాణిన స్సర్వే విచిత్రగతి మైశ్వరీం
మాయాం ప్రాప్యబహూన్ క్లేశాన్ సుఖ మిత్యాహుసంతి హి,
మాయయాఽపహృతజ్ఞానా స్సుఖదుఃఖవిభేదనం. 5

తా॥ హే స్వామీ! ప్రకృతి యనెడి మాయ నీచేత సృజింపబడినదిగదా! బ్రహ్మాదిప్రాణు లన్నియు విచిత్రమగు నీ మాయాస్వరూపమైన ప్రకృతిని పొంది అనేకములయిన సుఖదుఃఖములను పొందగల రని పెద్దలచే చెప్పబడుచున్నది. అట్టి మాయచేత అపహరింపబడిన జ్ఞానము కలవారలై, అనగా అజ్ఞానులై, సుఖదుఃఖముల యొక్క సమత్వమును, అనగా భేదరహితత్వమును, గుర్తెఱుగరుగదా. మీయొక్క మాయ యిట్టి దుస్తరమైనది. 5

శ్లో॥ న జానంతి జగత్స్వామిన్! త్వన్మాయా హీదృశీ కిల,
విద్యయా తపసా వాఽపి వేదాధ్యయనతోఽపి వా,
ధర్మశాస్త్రాదిపాఠేన పురాణపఠనేన వా,
యజ్ఞాదికర్మభి ర్వాఽపి పిత్ర్యకర్మాదిభి స్తథా రే.
మాయాం త్వదీయాం జిత్వా యః కశ్చిన్మోక్షమవాప్నుయాత్,
పరివృత్తా వనేకానాం యుగానామపి వల్లభ.
కశ్చి త్ప్రాణీ సమాయాతి మాయయా మోహితేషు వై,
జ్ఞాతో భవద్భి స్తద్ధేతు ర్న జానే భగవ న్నహం. 9

తా॥ ఓ స్వామీ, విద్యచేతను, తపస్సుచేతను, వేదాధ్యయనము చేతను, ధర్మశాస్త్రపఠనముచేతను, పురాణపఠనముచేతను, యజ్ఞాది కర్మలచేతను మీయొక్క మాయను జయించి అనేక యుగముల కాలము తిరుగుచున్నప్పటికిని మోక్షము నెవ్వడు పొందగలడు? అట్టివారెవ్వరైన నుందురేమో మాకు తెలియదుగాని మీకు తెలిసి యుండును. ఆ హేతువును మేము తెలిసికొనలేము. 9

శ్లో॥ వినా భవంతం క్షణికం నయా మ్యాస్యతి పూరుష!,
తథాపి న మయా జ్ఞాతం మోక్షదం వేదశాస్త్రకం.
కార్యం వాఽపి తదుద్దిష్టం భవతా చ ప్రకాశితం,

న రహాస్యం యది భవేద్భక్తాయా మమ వత్సల!.
సర్వలోకహితార్థాయ మమ చ ప్రీతయే భవాన్,
ఉపాదిశ జగత్స్వామిన్! తేన ముక్తి మవాప్నుయుః. 12

తా॥ ఓ స్వామీ, మిమ్ములను వినాగా నేను అన్యదేవుని ఆరాధింపలేదు. ఆ ప్రకారము ఏకభక్తిగా మిమ్ములను సేవించు చున్నప్పటికీ ఆ మోక్షవిద్య నాకు తెలియలేదు. మీచేత ప్రకటింప బడిన భగవదారాధనరూపమగు విధానము రహస్యమైనది కాకపోయి నట్లయిన భక్తురాలనైన నాకు సర్వలోకహితముకొఱకును, నేను తరించుకొఱకును ఉపదేశించుమని అని లక్ష్మి యాచించెను. 12

భగవా నువాచ:—

శ్లో॥ పద్మే! త్వత్తోపి మే గోప్యం త్రైలోక్యే నాస్తి వల్లభే,
అవతారాదిషు మయా సహ తిష్ఠసి సువ్రతే.
ఇత్థం స్థితే మయా గోప్యం త్రైలోక్యే నాస్తి వల్లభే,
సర్వజ్ఞా హ్యపి మాం దేవి త్వ మజ్ఞేవ మమ ప్రియే.
లోకస్య హిత మిచ్ఛంతీ మాం పృచ్ఛసి వరాననే,
లోకమాతు రయం ప్రశ్న స్త్వయైవోపహితం హి నః. 15

తా॥ ఓ లక్ష్మీ! మూడులోకములయందును నీకంటె గోప్యమైన అన్యవస్తువు లేదు. సమస్తావతారములయందును నాతో సహచరివై చరించుచున్నావు. అందువలన నీకన్న ముఖ్యమైనదియు, గోప్యమైన దియు, నేదియునులేదు. నీవు సర్వజ్ఞురాలవుగదా! అయినప్పటికిని అజ్ఞానురాలవలె ప్రవర్తించుచున్నదానవై లోకహితమును గూర్చి నన్ను అడుగుచున్నావని శ్రీమన్నారాయణుడు లక్ష్మినిగూర్చి చెప్ప నుపక్రమించెను. 15

శ్లో॥ ఆదితో దేవి! వక్ష్యామి బ్రహ్మాదీనా మహం పురా,
నోపాదిశం ముక్తిశాస్త్రం జగతో వృద్ధయే రమే.
బ్రహ్మకల్పే పురా ప్రాప్తే సర్వం సలిల మావృతం,
యోగలక్ష్మిస్వరూపేణ శ్రీవత్సాంతర్హితా హ్యసి.

తమసా సర్వలోకేషు వ్యాప్తేషు సచరాచరం,
లోక మ్మదుదరం ప్రాప్య స్థితం బ్రహ్మసమన్వితం.
తదా బాలం సమాస్థాయ రూపం జలనిధావపి,
వటపత్రే శయానోఽహం తం కాల మనయం రమే. 19

తా॥ ఓప్రియురాలా! దీని వృత్తాంతమును చెప్పెదను వినవలసి నది. పూర్వమందు బ్రహ్మకులకును నేను చెప్పలేదు. ఎందువల్ల ననగా, పూర్వము బ్రహ్మకల్పమందు సర్వజగజ్జాలము జలవ్యాపకమై యున్నప్పుడు యోగలక్ష్మిస్వరూపురాలవై నాయొక్క వక్షఃస్థలమం దున్నదానవై తివి. బ్రహ్మయుక్తమైన సమస్తలోకసముదాయము జల నిధియందు వటపత్రశాయినై బాలస్వరూపముగా నున్న నాయుదర మందు లీనమై యుండెను. ఈప్రకారము అనేక యుగకాలములు గడచెను. 19

భగవానువాచ:—

శ్లో॥ బ్రహ్మరాత్ర్యాం వ్యతీతాయాం మత్సంకల్పా దయం ప్రియే,
మన్నాభికమలోద్భూతో బ్రహ్మ లోకపితామహః.
కర్ణికాయాం క్వచి త్కాలం తిష్ఠ న్నంతర్హితం జలే,
అజానన్ చింతయన్నేవ కించి త్కాల మవస్థితః.
తత స్తస్య మతి ర్జాతా పంకజోప ర్యహం స్థితః,
పంకజస్య క్వచి ద్బాధ మంతరా న స్థితి ర్భవేత్.
తస్మిన్ బాధః పంకజో య స్తం జ్ఞాస్యామీతి నిశ్చితః,
పద్మస్య నాళరంధ్రేణ గంతు మంత రభిత్వరన్.
మార్గ మన్విష్యమాణస్య నాదా మ్మార్గం తదా హ్యహం,
చింతా మాస్థాయ స విధి స్తవ మాతిష్ఠ దవ్యయం.
తతో వర్షసహస్రాంతే హంసరూపం సమాశ్రితః,
స్థిత్వాఽఽకాశే త్రయీరూపం కర్మకాండమయం శుభం.
జగత్సృష్టే రాదికంద ముపాదిక్షం విధేః పురా,
తత స్సంతుష్టహృదయ స్త్రయీం కర్మప్రవర్తినీం. 26

తా॥ ఇట్లుండగా, నాసంకల్పమువల్ల నా నాభిపద్మమం దుత్పన్నుడైన బ్రహ్మ నన్ను తెలియలేక చాలకాలము తపస్సుచేయుచు ఆపద్మముయొక్క యుత్పత్తిస్థానమును తెలిసికొందమను నభిప్రాయము కలవాడై ఆపద్మముయొక్క నాళరంధ్రముచేత తెలిసికొనగలందులకు నడచినవాడాయెను. అలాగున నాళబంధముయొక్క యుత్పత్తిని తెలిసికొన నిశ్చయించిన బ్రహ్మకు ఆపద్మముయొక్కస్థితి తెలియకపోయెను. అంతట బ్రహ్మ చింతను పొంది తిరిగి స్వస్థానమునకు వచ్చి నన్నుగురించి అనేకవేలసంవత్సరములు తపస్సు చేయగా, నేను హంసరూపమును పొంది ఆకాశమునం దుండి వేదత్రయీరూపమై మంగళకరమై జగత్సృష్టి మొదలయిన కర్మకాండాదిరూపమగు శాస్త్రమును ఉపదేశించితిని. 26

శ్లో॥ ప్రాప్య బ్రహ్మ తదా మాం తు మానసై రార్చయత్సుమైః,
అనుజ్ఞయా మమ విధి స్సత్యలోక ముపేయివాన్.
మరీచ్యాదీన్ పురా సృష్ట్వా తేభ్యో వేదా నుపాదిశత్,
తేఽపి ప్రాప్య త్రయీం తద్వ దసృజన్ ప్రాణినో బహూన్.
స్థావరాణి చ సర్వాణి వృక్షగుల్మలతా రమే!
ఇత్థం సృష్ట్వా కర్మకాండ మధీయానాశ్చ నిత్యశః.
కుర్వాణాః కర్మణో భేనాం స్తేషు తృప్తాశ్చ దేవతాః,
ప్రావర్తయంశ్చ భూలోకే కర్మకాండా ననేకధా. 30

తా॥ ఓ లక్ష్మీ! అట్లు బ్రహ్మ సృష్టిస్వరూపమైన విద్యను పొంది సంతుష్టహృదయుడై నన్ను సేవించుచు, నా యొక్క ఆజ్ఞచేతను సత్యలోకమును పొంది మరీచ్యాదులను సృష్టించి వారికి వేదముల నుపదేశించెను. వారు ఆ వేదమును పొంది స్థిరచరరూపమగు అనేకజ తుజాలాదిప్రాణికోట్లను సృష్టించిరి. ఈ ప్రకారము సృష్టిని జరిగించుచు, కర్మకాండమును అధ్యయనముచేసి ఆచరించుచున్నవారలై తృప్తినిపొంది ఆ మరీచ్యాదులు భూలోకమందునను, ఆ కర్మకాండ ననేకవిధములుగా వెల్లడించిరి. 30

శ్లో॥ ధర్మార్థకామరూపాణా మర్థానా ముపదేశతః,
మానవా స్తేషు విశ్వాస మనుప్రాప్తా స్సుమధ్యమే. 31

తా॥ ఓ లక్ష్మీ! అది మొదలుకొని భూలోకములో మానవులు ధర్మార్థకామములయందు ఆసక్తి గలవారలై కర్మకాండాదిరూపమగు వేదము నుపదేశించుచు వానియందు విశ్వాసము కలవారలైయుండిరి.

శ్లో॥ నివృత్తిశాస్త్ర మపరం వేదం వాఽపి తదర్థకం,
నాపృచ్ఛన్మాం విధిముఖా నాఽవోచం చాప్యహం రమే!,
సంవత్సరం తదర్థం వా గురుశుశ్రూషయా తతః,
సచ్ఛిష్యాయోపదేష్టవ్య మితి శాస్త్రేషు వర్తతే.
తద్విధిం సమతిక్రమ్య రహస్యం శాస్త్ర ముత్తమం,
పద్మమాలిని! నావోచం వేదం తద్బోధకం చ తత్. 34

తా॥ ఓ ప్రియురాలా! నివృత్తిరూపమైన వేదమును ఆ బ్రహ్మాదులు నన్నడుగలేదు. అందువలన వారికి నేను చెప్పలేదు. కనుక అడుగని వారికి చెప్పగూడదు. మఱియు సంవత్సరముగాని, తదర్థము, అనగా ఆఱుమాసములుగాని, గురుశుశ్రూష చేసినశిష్యునికొఱకు నుపదేశించవలసినదని శాస్త్రములయందు చెప్పబడియున్నది. కనుక అట్టివిధిని అతిక్రమించి రహస్యమైనటువంటి బ్రహ్మవిద్యాశాస్త్రమును బ్రహ్మమొదలగు వారిలకొఱకు చెప్పకపోయితినిసుమా యని భగవానులు ఆజ్ఞాపించిరి 34

శ్రీరువాచ:—

శ్లో॥ నమామి పుండరీకాక్ష జగదాదే దయానిధే,
తవ శక్తి ర్విచిత్రా హి గుణమాయావిమోహితాః.
కథం జ్ఞాతుం ప్రవర్తంతే తచ్ఛాస్త్రం వా తదర్థకం,
వేదం వాఽపి మహోదార! సంసారపతితా ఇమే.
మయి ప్రీతి స్తవ యది వేదం తచ్ఛాస్త్ర మాదితః,
ఉపాదిశ హరే! సర్వం లోకానుగ్రహకామ్యయా. 37

తా॥ ఇట్లు భగవానులు చెప్పినమీదట లక్ష్మీదేవి అడిగినదేమనగా స్వామీ! తమయొక్క మాహాత్మ్యము ఇటువంటిదని యెంచవలవిగాదు. సంసారార్ణవమగ్నులై మాయామోహితులైన లోకులీ శాస్త్రమునుగాని తదర్థమునుగాని తెలుసుకోలేకుండనున్నారు.

దేవరవారు లోకానుగ్రహాకాంక్షతో నాయందు గల దయచేత మోక్ష స్వరూపమై భగవదారాధనరూపమైన యీ పాంచరాత్రి శాస్త్రమును నా కుపదేశింపవలసినదని అడిగెను. 37

భగవా నువాచ:—

శ్లో॥ వేద మేకాయన న్నామ వేదానాం శిరసి స్థితం,
తదర్థకం పాంచరాత్రం మోక్షదం తత్క్రియావతాం.
యస్మి న్నేకో మోక్షమార్గో వేదః ప్రోక్త స్సనాతనః,
మదారాధనరూపేణ తస్మా దేకాయనం భవేత్.
రాత్రి రజ్ఞాన మిత్యుక్తం పంచేత్యజ్ఞాననాశకం,
తచ్ఛాస్త్రం పాంచరాత్రం స్యా దస్వర్థస్యాస్య గౌరవతః.
సార్థకోటిప్రమాణేనా౽నుష్టుభా ఛందసా రమే!
వేదవ న్నిత్య మేతచ్చ మల్లోకే నిత్యసూరయః,
అమనంతి సదా భక్త్యా మనసా పూజయంతి చ,
అంతరైత ద్వేదశాస్త్రం జ్ఞానం మోక్షప్రదం న హి.
యస్మిన్ జ్ఞానేన సహితం యోగం చాపి విశేషతః,
ఆలయానాం చ నిర్మాణం బింబనిర్మాణమేవచ.
ఏతేషాం లక్షణం చాపి సవిశేష ముదాహృతం,
ప్రతిష్ఠా చాగ్ని౽కార్యం చ ప్రాయశ్చిత్త మశేషతః.
పూజకానాం చ దీక్షా చ సిద్ధాంతా స్సముదీరితాః,
మద్యాగా వివిధాః ప్రోక్తా హ్యుత్సవా బహుభేదవత్,
మంత్రోద్ధారాదికార్యాణి బహూ న్యస్మిన్ స్థితానిహి. 85

తా॥ ఇట్లు లక్ష్మీదేవిచేత ప్రార్థింపబడి భగవానులు ఆజ్ఞ సాయించినదేమనగా, ఓ లక్ష్మి! ఈ మహాగోప్యమైన శ్రీపాంచరాత్రిశాస్త్రము, ఏకాయనమను పేరు గలిగి, వేదములకు శిరస్సైన, అనుష్ఠించువారికి మోక్షప్రదరూపమగు మదారాధనరూపమై సార్థకోటిప్రమాణముగా, నిత్యమై, నాలోకమందు నిత్యశూరులచేత నెల్లప్పుడు మహాభక్తితో అనుష్ఠింపబడుచున్నదో, అట్టి పాంచరాత్రిము అనగా, రాత్రి అను నజ్ఞానమును, పంచఅనుదానిచే నశింప

జేసి జ్ఞానముచే పరిశోభించుచు ఏకస్వరూపమై వేదమందు ముఖ్య మార్గముగా చెప్పబడ్డది అందువల్ల ఏకాయనమనియు, పాంచరాత్రమనియు పేరుపొందెను. అట్టి మోక్షరూపమగు పాంచరాత్రశాస్త్రము ఆలయబింబ నిర్మాణ రూపమై ప్రతిష్ఠాగ్నికార్య ప్రాయశ్చిత్త పూజాదికా సిద్ధాంతాదివిశేషలక్షణములతో మంత్రోద్ధారాది స్వరూపముగా జ్ఞానయోగాదిబహుభేదములతో నొప్పుచున్నది. తదితర వేదశాస్త్రములయందు జ్ఞానమోక్షప్రదములు లేవు సుమా యని భగవానులు ఆజ్ఞ సాయించిరి. 45½

శ్రీరువాచ:—

శ్లో॥ కథం మహతి శాస్త్రేఽస్మిన్ సంసారే పతితా జనాః,
పరివర్తంతే దేవదేవ! జ్ఞానం చాపి కథం భవేత్.
శ్రద్ధా వాపి కథం తేషాం సంసారేషు నిమజ్జతాం,
వాసనావివశాః కేచి జ్జగ దాహు రనీశ్వరం.
నిత్యం శరీరం కేచిచ్చ సంసృతే ర్నాస్తి సౌఖ్యదం,
ఏవం బహువిధా భేదా జంతూనా మ్మతయోఽన్యథా.
భ్రమంతి తిస్నివృత్తిస్తు కథం స్యా జ్జగతీపతే,
మహాంతో హ్యుపదేష్టారో న సంతి జగతీపతే.
ఉపదిష్టం న గృహ్ణంతి జనాః కామవిమోహితాః,
తథాపి కృపయా మేఽద్య శాస్త్రం సంగృహ్య సారవత్,
ఆదాయ సాత్త్వికం భాగం పాంచరాత్ర ముపాదిశ. 51

తా॥ అంతట లక్ష్మీదేవి భగవానులయొక్క వాక్యములను విని ఓస్వామీ! సంసారసముద్రమందు మగ్నులైనటువంటి జను లీ శాస్త్రమం దెట్లు ప్రవర్తించగలరు? జ్ఞానమును ఎట్లు సంపాదించగలరు? ఎట్లు శ్రద్ధాభక్తులు కలవారౌదురు? లోకములో కొంతమంది జనులు పూర్వకర్మవాసనావశాత్తు జగత్తును ఈశ్వరరహితమైనదానినిగా చెప్పుదురు. మఱికొందరీ శరీరమే నిత్యమనియు, కొంతమంది అనిత్యమనియు, భేదవాదములతో నున్నారు. ఇట్టివారలకు నివృత్తిమార్గ మెట్లు కలుగును? ఇట్టి రహస్యోపదేశకర్తలు

దొరుకుట దుర్లభముకదా, దొరికినను అట్టి యుపదేశరహస్యజ్ఞానము నొందువారలు స్వల్పముగదా! అయినప్పటికి నీవు భక్తవత్సలుండవు. కనుక నీవేదరహస్య పాంచరాత్రిభాగమును సంగ్రహరూపముగా నుపదేశింపవలసినదని లక్ష్మీదేవి భర్త నడిగెను. 51

భగవా నువాచ:—

శ్లో॥ త్వయోక్త ముచితం దేవి విధిప్రభృతిదేవతాః,
భ్రమంతే సంసృతిం ప్రాప్య కింపున ర్మనుజా భువి.
త్వయాఽహం ప్రార్థితో దేవి పీయూష ముదధే ర్యథా,
సాత్త్వికం భాగ ముద్ధృత్య లోకస్య హితకామ్యయా.
వదామి కనులే తుభ్యం శృణు లోకహితంకరి,
మన్మూర్తయః పంచవిధా వదం త్యుపనిషత్సు చ.
పరవ్యూహా హార్ద ఇతి విభవోఽర్చాతి భేదతః,
వైకుంఠేఽస్మిన్ పరవ్యూహా సదా పశ్యంతి సూరయః.
యోగతత్త్వేన మునయ స్సదా మాం ధ్యానగోచరం,
పశ్యంతి దేవి! హృన్మధ్యే తస్మా న్మాం హార్ద ఉచ్యతే.
అవతారేషు తత్కాలే పశ్యంతోఽపి జనా భువి,
అవజానంతి మునయో జానంతి జ్ఞానినో రమే! 57

తా॥ ఓ నాప్రియురాలా, నీవు పలికినవి నిజమే. బ్రహ్మాది దేవతలును, ప్రకృతిరూపమగు సంసారమును పొంది భ్రాంతిని పొందు చున్నారు. మర్త్యలోకమందు గల జనులు భ్రాంతి బొందుదు రనుటకు ఆశ్చర్య మేమున్నది. కనుక ఓ లక్ష్మీ! నీచేత ప్రార్థించబడినవా డనై సముద్రమువల్ల అమృతమునువలెనే సాత్త్వికరూపమైనటువంటి యీ వేదశిరోభాగమును లోకోద్ధరణముకొఱకు నీకు చెప్పుచు న్నాను, వినవలసినది. ఏమనగా నాయొక్క స్వరూపము ఉపనిషత్తుల చేత పరవ్యూహాది పంచప్రకారములుగ చెప్పబడుచున్నది. వాని యందు, పరస్వరూపము, వ్యూహస్వరూపము వైకుంఠమందు నిత్య

శూరులు సేవించుచుందురు. కొంతమంది మహాయోగులు ధ్యానయోగము చేత నన్ను చూచుచుందురు. కొంతమంది తమ హృదయపద్మములయందు నన్ను నున్నవానినిగా సేవించుచుందురు. భూలోకమందు జనులు, విభవ - అర్చాది, నాయొక్క అవతారములయందు నన్ను చూచుచును తెలిసికోలేరు. జ్ఞాను లెల్లప్పుడు నన్ను జ్ఞానస్వరూపునిగా తెలుసుకొనుచున్నా రని భగవానులు తదారాధనస్వరూపమోక్షవిద్యను లక్ష్మీదేవికి నుపదేశించె నని శ్రీమహాలక్ష్మీవలన తెలుసుకొబడిన బ్రహ్మపుత్రుడగు ఏకతమహాఋషి, వింధ్యనివాసులైన మహాఋష్యాదులకు చెప్పెను.

ద్వితీయాధ్యాయము సమాప్తము.

---

శ్రీ ప్రశ్నసంహితాయాం, చతుర్థోధ్యాయః.

శ్లో॥ త్వయా ప్రోక్తో యోగసారో దుర్లభార్థస్య సాధకః,
తథాప్యేతేషు యోగేషు విఘ్నా బహువిధా హరే.
అనేకకాలసాధ్యాశ్చ తేషు కో వా ప్రవర్తతే,
ప్రాయేణ జంతవో లోకే కామభోగపరాయణాః.
తస్మా దిమం పరిత్యజ్య మార్గం లోకహితాయ వై,
సిద్ధిదం చాతిశీఘ్రేణ విఘ్నైశ్చాపి న చాల్యతే,
తం మార్గం వద దేవేశ! లోకస్య హితకామ్యయా.

భగవాన్:—

పద్మస్థితే! పద్మహస్తే! త్వత్ప్రశ్నసదృశోత్తరం.
యద్దర్శనం హి జంతూనాం సర్వసిద్ధిప్రదం భవేత్,
ఏతావత్కాలపర్యంతం జ్ఞానినో యోగినోపివా.
ఇతరే వా నవ్యాజాన న్నచార్చారూపం వరాననే,
దేవో వా మానుషోవాపి ప్రమత్తేషు చతుర్ష్వపి.
ఏకం వా చతురో వాఽపి ప్రార్థయే న్మాం వరాననే,
నిష్కామో వా సకామో వా వైకుంఠోపమమందిరం.
పుణ్యక్షేత్రే పురా కృత్వా త్వయా సహ సుమధ్యమే,

అర్చారూపం పాంచరాత్రవిధినా సర్వకామదం.
మంత్రమూర్తిం ప్రతిష్ఠాప్య మందిరాంతర్గతం హరిం,
తచ్ఛాస్త్రోక్తాం పురా దీక్షాం కృత్వా దేశికసత్తమః.
పూజయే ద్యది మద్బింబం వేదవేదాంగపారగః,
గృహే వాఽపి ప్రతిష్ఠాప్య నిత్యం పూజయతే యది.
అహం తద్బింబ మావిశ్య భక్తానా మిష్టసాధకః,
త్వయా సహ భవిష్యామి నాఽత్ర సందేహ అస్తు తే. 11

తా॥ ఓస్వామీ, మీరు పూర్వము సాయించిన యోగము అలభ్యవస్తుసాధకమైనను ఆయోగము చాలకాలమునకుగాని సాధ్యము కానిది. కాన నిట్టి యోగమందు కామక్రోధాదులచే మూఢులైన సామాన్యజనుల కెట్లు ప్రవృత్తి గలుగును? కాన దీనిని విడిచి త్వరలో అధికఫలదమగు మార్గాంతరము నను లోకానుదిదృక్షచే ఆజ్ఞ నియ్య బ్రార్థించుచున్నాను. అని లక్ష్మీదేవిచే యాచింపబడిన తరువాత భగవానులు చెప్పిన దేమనగా ఓ ప్రేయసీ! నీప్రశ్నకు సరియగు నుత్తరము నింతవఱకు నెవ్వరును దెలిసికొనియుండ లేదు. అట్టిది యెద్దియన, పుణ్యక్షేత్రమందు వైకుంఠమునకు సమానమగు సుందరవిమానములతోఁగూడిన ఆలయమును పాంచరాత్రశాస్త్రోక్తరీతిని కట్టించి అందు నీతోఁ గూడియున్న నన్ను తచ్ఛాస్త్రోక్తవిధానముచే బ్రతిష్ఠించి ఆపాంచరాత్రశాస్త్రమందు చెప్పబడిన దీక్షను పొందిన వేదాంతపారగుడగు బ్రాహ్మణుడు పూజించినచో నేను ఆబింబమును ప్రవేశించి భక్తుల కభీష్టములు నిచ్చుచుందును. ఇందు సందేహము లేదు. 11

శ్లో॥ భగవాన్ కేషు దేశేషు కేన ద్రవ్యేణ వా పునః,
యజమానః కీదృశ స్స్యా దాచార్యః కై ర్గుణై ర్యుతః,
కీదృగ్గుణసంయుక్త ఆలయ స్తే ప్రియో భవేత్.

భగవా నువాచ:—

ఆస్తికః కర్మకాండోక్త కర్మానుష్ఠానతత్పరః,
శ్రద్ధావా ననసూయశ్చ ధనధాన్యధనై ర్యుతః.

మద్భక్తో దేవపూజాదౌ ప్రీతిమా నపరై ర్గుణైః
సంయుక్తో బ్రాహ్మణో వైశ్యః క్షత్రియ శ్శూద్ర ఏవవా.
అనులోమో భవే ద్వాఽపి యజమానో భవే ద్రమే. 15

తా॥ ఓ స్వామీ, దేవరవారిచే ఆజ్ఞ సాయించిన, భగవదాలయనిర్మాణములకు ప్రదేశ మెట్టిదో ద్రవ్య మెట్టిదో యజమానుడెట్టివాడో ఆచార్యు లెట్టిలక్షణయుక్తులో యేరూపము గల ఆలయము భగవత్ప్రీతికరమో యెఱిగింపవేడుచున్నా నని అడిగెను. అప్పుడు భగవానులు, ఓలక్ష్మీ! యజమానుడు భగవద్భక్తిగలవాడును, స్వస్వకులాచారము ననుష్ఠించువాడును, అసూయ లేనివాడును, ధనవంతుడును, బ్రాహ్మణాదిజాతులయందు గాని అనులోమజాతియందుగాని పుట్టినవాడునై యుండవలయును.

భగవా:—

శ్లో॥ సర్వవిద్యాసు కుశల శ్శాంతో బ్రాహ్మణపుంగవః,
జితేంద్రియో జితక్రోధః కర్మఠ స్తపసి స్థితః.
విష్ణుభక్తో వాస్తుశాస్త్రే నిష్ణాత శ్శిల్పవిత్తమః,
పాంచరాత్రోక్తవిధనా దీక్షితో దీక్షితోత్తమైః.
పాంచరాత్రార్థతత్త్వజ్ఞో మదంశో గురు రీదృశః
ఏవంవిధం గురుం జ్ఞాత్వా గృహం తస్య వ్రజే త్సుధీః,
నత్వా తం శిరసా పూర్వం ప్రార్థయే త్సౌధకర్మణి.
అహం భగవతో విష్ణో ర్మందిరం కర్తు ముద్యతః,
లక్షణజ్ఞో భవాన్ సౌధం కర్తు మర్హతి శిల్పిభిః.
ఇతి సంప్రార్థ్య విప్రేంద్రం నారికేళఫలం తతః,
దద్యా త్తస్మై సర్వకార్యభారం తస్మి న్నివేశయేత్.
ప్రార్థితో యజమానేన తత్ఫలావాప్తయే గురుః,
శుభే దివసనక్షత్రే శుభే లగ్నే స్వయం గురుః,
తూర్మకరిగ్రహపూర్వాది కుర్యా త్కర్త్రాంతికై స్సహ. 22

తా॥ ఓలక్ష్మీ! ఇక ఆచార్యలక్షణ మెట్టిదనిన, సర్వశాస్త్రములను చదివినవాడును, శాంతముగలవాడును, జితేంద్రియుడును, కర్మ

సక్తుడును, విష్ణుభక్తుడును, వాస్తుశాస్త్రమందు ప్రవీణుడును, భగవచ్ఛాస్త్రోక్తరీతిని దీక్షితుడును, ఆగమవేత్తయు, నాయంశ కలవాడును, ఆచార్యుడనబడును. అట్టి ఆచార్యుని తెలిసికొని యజమానుడు ఆచార్యగృహమునకు వెళ్లి దాసోహము సమర్పించి స్వామీ! దాసుడు పెరుమాళ్లకు ఆలయకైంకర్యము చేయవలయునని కోరుచున్నాడు. అద్దానికి శిల్పులసాహాయ్యముతో లక్షణజ్ఞులగు దేవరవారు నెరవేర్చదరు గాక యని ఇట్లు ప్రార్థించి బహూకరించి సర్వకార్యనిర్వాహకభారమును ఆచార్యులపై నుంచవలయును. ఈరీతిగా ప్రార్థింపబడిన ఆచార్యులు శుభముహూర్తమందు జ్యోతిశ్శాస్త్రపండితసాహాయ్యముచే కర్షణాదికప్రతిష్ఠాంతకర్మలను నెరవేర్చవలయును. 22



శ్రీ ప్రశ్నసంహితాయాం షోడశోధ్యాయః

భగవాన్:—

శ్లో॥ యజమానో హరేర్భక్తం సర్వలక్షణలక్షితం
భువః పరీక్షాప్రభృతి మూలమూర్త్యాదిభిర్యుతం.
ఆలయం తం సమాలోక్య ప్రతిష్ఠాం కర్తుముద్యతః,
ఆచార్యం వరయేత్పూర్వం పాంచరాత్రోక్తలక్షణం. 2

తా॥ ఓలక్ష్మీ! యజమాని సర్వలక్షణములతోకూడినట్టియు, కర్షణాదివిధులు నిర్వర్తింపబడి మూలబింబముతోకూడియున్న ఆలయమును కనుగొని ప్రతిష్ఠచేయుటకు పూనుకొని పాంచరాత్రశాస్త్రోక్త లక్షణములుగల ఆచార్యులను వరించవలయును. 3

శ్లో॥ తల్లక్షణం ప్రవక్ష్యామి పద్మమాలావిరాజితే,
చతుర్వేదవిదో విప్రాః ప్రాహుః శ్రోత్రియసంజ్ఞకాః.
దశశ్రోత్రియతుల్యాంస్తు పాంచరాత్రవిదోఽర్చకాః,
పాంచరాత్రంచ వేదాంశ్చ వేత్త్యసౌ పూర్ణసంజ్ఞకః. 3-4

తా॥ ఓలక్ష్మీ, అట్టి ఆచార్యలక్షణ మేమనగా నాలుగు వేదములను చదివిన బ్రాహ్మణులను శ్రోత్రియులందురు. అట్టి శ్రోత్రి

యులు పదిమందియైనచో పాంచరాత్రిసము లగుదురు. వేదములను, పాంచరాత్రశాస్త్రమును తెలిసిన విప్రుని పూర్ణు డందురు. 4

శ్లో॥ యోఽధీతే వేదవేదాంగం పాంచరాత్రమపి ద్విజః,
అధ్యాపయతి శిష్యాం స్తు పాంచరాత్రమపి శ్రుతేః
దశపూర్ణసమ స్సోయం దీక్షితో గురు రుచ్యతే,
దీక్షితస్య కులే జాతో భట్టాచార్యేణ దీక్షితః.
గురో స్సుఖా త్త్రయీం విద్యామర్థవ త్పాంచరాత్రకం
ప్రాప్త శ్శమదమోపేత స్స తు భట్టారకో భవేత్. 7

తా॥ ఓ లక్ష్మీ, ఏ విప్రుడు వేదమును, షడంగములను, పాంచరాత్రశాస్త్రమును అభ్యసించి యితరులను అభ్యసింపచేయునో, ఆ విప్రుడు పదిమందిపూర్ణులతో సమానుడగు దీక్షితు డనబడును. అట్టి దీక్షితకులమందు బుట్టి దీక్షితుడై గుర్వధ్యయనపూర్వకముగా వేదాధ్యయనము చేసి పాంచరాత్రశాస్త్రమును నిష్కృష్టముగా తెలిసికొని శాంతిమొదలగు గుణములు కలిగినవాడు భట్టారకు డనబడును. 7

శ్లో॥ దశభట్టారకసమో వేదవేదాంగపారగః
వేదాంతార్థప్రవీణశ్చ పాంచరాత్రార్థతత్త్వవిత్
పరంపరాదీక్షితస్య కులేజాత స్సమాధమాః
దీక్షా ముభయతః ప్రాప్తః పంచకాలక్రియాపరః.
యోగశాస్త్రప్రవీణశ్చ జ్ఞానవా న్నోత్కచింతకః
భువః పరిగ్రహా ద్యావ త్ప్రతిష్ఠాంతం చ యా క్రియా
అసహాయేన తాం కర్తుం శక్తో మధ్యో న రోగవాన్
స్వతంత్రో వృద్ధసేవీచ రూపవానపి చాస్తికః
పరై రనిందిత శ్చైవ కీర్తిమా న్విజితేంద్రియః
మానసారాధనే దక్షో మంత్రిశాస్త్రవిచక్షణః
సిద్ధమంత్ర స్సర్వదర్శీ భట్టాచార్య స్సఉచ్యతే. 12

తా॥ ఓ లక్ష్మీ! అట్టి పదిమంది భట్టారకులతో తుల్యుడును వేద వేదాంగములను తెలిసినవాడును, శ్రుత్యంతార్థమును చక్కగా తెలిసిన

వాడును, భగవచ్ఛాస్త్ర ప్రవీణుడును, వంశక్రమముగా దీక్షితు లైనవారి వంశమందు జన్మించినవాడును, ఉభయదీక్షాపరుడును, అనగా (పంచసంస్కారదీక్షయు, ఆచారదీక్షయు) (ఇవియే స్వార్థ దీక్షయు, పరార్థదీక్షయు) పంచకాలిక కర్మానుష్ఠానపరుడును, పాతంజలయోగశాస్త్రాదినిపుణుడును, ముముక్షువును, కర్షణాది ప్రతిష్ఠాంతమును ఇతరసాహాయ్యము లేకనే నిర్వర్తించువాడును, నీరోగియు, సుగుణసంపత్తిగలవాడును, ఆస్తికుడును, జితేంద్రియుడును, మానసారాధనము చేయుటయందు దక్షుడును, మంత్రశాస్త్రజ్ఞుడును, మంత్రసిద్ధి గలవాడును, సర్వశాస్త్రజ్ఞుడును, అయినవిప్రుడు భట్టాచార్యు డనబడును; అని భగవానులు చెప్పిరి. 12½

శ్లో॥ చక్రాబ్జమండలే దీక్షా మకరో ద్యస్య వై గురుః
అభిషేకః కృతో యస్య పూర్వోక్తైశ్చ గుణై ర్యుతః.
కర్షణాదిప్రతిష్ఠాంతం విశేషయజనాదికం
స ఏవ కుర్యా దితర స్తత్సాధనపరో భవేత్.
పరదీక్షావిహీనో య స్సాధయే త్కర్షణాదికం,
కృతం నిరర్థకం కర్మ పున రన్యేన కారయేత్.
ఇతి ప్రోక్తం త్వయా నాథ! దీక్షా సా కీదృశీ మతా
చక్రాబ్జమండలం కిం వా హ్యభిషేకః కథం తు వా.
మహ్యం జిజ్ఞాసమానాయై వద త్వం పురుషోత్తమ. 17

తా॥ పైన చెప్పబడిన భగవద్వాక్యములను విన్నటువంటిదై లక్ష్మీదేవి ప్రశ్నించిన దేమనగా, ఓస్వామీ! చక్రాబ్జమండలమందు నెవనికి దీక్ష యివ్వబడునో అతడే గురువనబడుననియు, అట్టివానిచేతనే కర్షణాదిప్రతిష్ఠాంతమైన భగవదారాధనరూపమగు కర్మ నిర్వర్తింపబడవలయుననియు, అట్లుగాక, దీక్ష లేనివానిచేత చేయబడిన కర్షణాదిప్రతిష్ఠాంతమైన కర్మ భస్మాహుతియట్లు నిరర్థక మగుననియు దేవరవారు ఆజ్ఞాపించినారు. కనుక తమచే చెప్పబడిన దీక్ష యెట్టిదో దానిస్వరూపమును నా కెఱింగింప బ్రార్థించుచున్నాను; అని లక్ష్మీదేవి అడిగెను. 17

శ్లో॥ దీక్షాస్వరూపం ప్రథమం వదామి కమలాలయే,
ఈక్ష్యతే కర్మణా యేన తద్విష్ణోః పరమం పదం
ద్యతి సంసార మఖిలం తేన దీక్షేతి భణ్యతే
ఏషా దీక్షా విరక్తైన కర్తవ్యా న తు కర్మభిః. 19

తా॥ ఓలక్ష్మీ! దీక్ష యనగా-(వ్యుత్పత్త్యర్థము) దేనిచేత శ్రియః పతియొక్క పరమపదము చూడబడునో, దేనిచేత కష్టభూయిష్ఠమైన సంసారము ఖండింపబడునో, అట్టిది దీక్ష యనబడును. (దోధాతువు యొక్కయు, ఈక్ష ధాతువుయొక్కయు, సమాగమ మిట్టి యర్థము నిచ్చుచున్నది.) ఈదీక్ష విరక్తులయినవారిచే చేయబడవలయును. 19

శ్లో॥ యథైవ కర్మకాండేషు దీక్షోక్తా యాగసిద్ధయే
తథైవైకాయనే వేదే పూజాయాగాదిసిద్ధయే.
దీక్షాయాః శ్రైష్ఠతాం కర్తుం విభజ్యాత్మాన మబ్జజే!
ప్రథమం శబ్దరూపేణ వృత్తిరూప మతఃపరం
అర్థరూపం తృతీయన్తు తథైవాచార్యరూపిణం
దీక్షారూపం పంచమం తం ప్రవిశ్య చ యథాక్రమం
మయా కృతో యస్య దీక్షా సోఽహమేవ న సంశయః
దీక్షా సా త్రివిధా ప్రోక్తా స్థూలా సూక్ష్మా పరా తథా
పున ర్దీక్షావిభేదేన త్రిధా సాపి చతుర్విధా
సమయీ పుత్రక శ్చైవ తృతీయ స్సాధకః స్మృతః
ఆచార్య శ్చేతి విజ్ఞేయ శ్చత్వారోపిచ దీక్షితాః. 24½

తా॥ మరియు నేరీతిగా గర్భాధానాది సంస్కారములయందు తత్తత్సంస్కారసిద్ధికొరకు దీక్ష యావశ్యకమో, అట్లగానే భగవచ్ఛాస్త్రమందును యాగసిద్ధికొరకు దీక్ష యావశ్యకము. అట్టిదీక్షకు శ్రైష్ఠ్యాపాదకముగా నేను, నన్ను అయిదువిధములుగా విభజించితిని. అందు ప్రథమము శబ్దరూపమును, ద్వితీయము వృత్తిరూపమును, తృతీయము అర్థరూపమును, చతుర్థము ఆచార్యరూపమును, పంచమము దీక్షారూపమును, ఇవియె పూర్వోక్తక్రమైన

అయిదువిధములు. కాన నట్టి దీక్షితుని సాక్షాత్తు నన్నుగానే తెలిసి కొనవలసినది. అట్టి దీక్ష స్థూలమనియు, సూక్ష్మమనియు, పరమనియు, మూడువిధములై యున్నది. తిరిగి ఆ మూడువిధములైనదీక్ష, సమయి, పుత్రిక, సాధక, ఆచార్యులను భేదములతో నాలుగువిధములై యున్నది. 24

శ్లో॥ ధర్మశాస్త్రోక్తధర్మాణా మనుతిష్ఠన్ హరేః ప్రియం
ప్రత్యహం పూజనం కార్యం పంచసంస్కారసంస్కృతః
ఇతి నిశ్చిత్య యః పూజాం ప్రత్యహం కురుతే రమే
సమయీ తస్య సా దీక్షా మానసీ పరికీర్తితా
వైష్ణవానాం హి సర్వేషాం యోగ్యా సా గృహపూజనే
ఏషాం స్థూలేతి విజ్ఞేయా శాస్త్రేషు పరికీర్తితా
అస్య గోత్రసముత్పన్నం దీక్షయ త్వభిమానతః
పాంచరాత్రప్రతిష్ఠాదౌ జ్ఞానం యస్య న విద్యతే
ఉభయోరపి యా దీక్షా క్రియతే దీక్షితోత్తమైః
సైషా సూక్ష్మా మధ్యమేతి కీర్త్యతే వేదవిత్తమైః
ఏతయో ర్నాభిషేక స్స్యా ద్దీక్షామాత్రం భవే ద్రమే
ఆచార్యసాధకౌ స్యాతా ముత్సవాదిషు వల్లభే
ఆచార్యదీక్షా ద్వివిధా నిర్బీజాచ సబీజకా
తంత్రాంతరే త్వాగమే చ సిద్ధాంతే తంత్రసంజ్ఞకే
తేషు పూజాప్రవృత్తానాం దీక్షా నిర్బీజసంజ్ఞికా
అన్యేషాం దీక్షకరణే తేషా మనధికారితా
అతో నిర్బీజ ఇత్యుక్తం విద్వద్భిః కమలేక్షణే. 33

తా॥ మరియు ఓలక్ష్మీ, ధర్మశాస్త్రములయందు జెప్పబడిన విధుల ననుష్ఠించుచు, "భగవత్ప్రీతికర"మైన భగవదారాధనను ప్రతి దినమును చేయుదును, అని నిశ్చయించి యెవరు పంచసంస్కారులై పూజింతురో వారు సమయిదీక్షితు లనబడుదురు. వీరికి గలిగిన దీక్ష మానసికదీక్ష యనబడును. ఈదీక్ష సమస్తమైన వైష్ణవసామాన్యులకును కలదు. ఇది గృహతిరువారాధనమాత్రోపయోగ్యమైనది.

దీనినే స్థూల మందురు. ఇట్టివానికులమందు బుట్టినవానికి అభిమాన పురస్సరముగా దీక్షను కలుగజేయుచున్నారు. ఎవనికి పాంచరాత్ర శాస్త్రోక్తమైన ప్రతిష్ఠాదికర్మలయందు జ్ఞానము లేకుండునో, ఎవనికి ఉభయదీక్షలు గలుగునో దానిని సూక్ష్మమనియు, మధ్యమనియు, చెప్పుదురు. ఈ చెప్పబడిన రెండుదీక్షలవల్లను, ఆలయాదుల యందు అర్చనాదికైంకర్యాధికార ముండదు. దీక్ష యేల యనినచో పరిచారకాదికైంకర్యాధికారసిద్ధికై ఉపయోగపడును. ఇక ఆచార్య దీక్ష, నిర్బీజమనియు, సబీజ మనియు రెండువిధములుగా చెప్ప బడుచున్నది. అందు నితరులకు దీక్ష యిచ్చుటయం దధికారము లేకుండుటచే నిర్బీజదీక్ష యనబడుచున్నది. 33

భగవా నువాచ:—

శ్లో॥ సబీజో మంత్రసిద్ధాంతదీక్షాక్రియ ఉదీర్యతే
చతుర్వేదోక్తమంత్రైశ్చ మంత్రైరేకాయనస్థితైః
మంత్రసిద్ధాంతవిధినా మదుక్తేనచ గోత్రిణా
వృద్ధేనాచార్యరూపేణ దీక్షితో యః పురా మయా
యా దీక్షా క్రియతే తేన సా దీక్షా తు పరా స్మృతా
దీక్షాం పరాం తు ప్రాప్యైవ పూజయే దాలయేషు వై. 36

తా॥ ఓలక్ష్మీ! యిక పరదీక్షయే సబీజదీక్ష యనబడుచున్నది. అట్టి పరదీక్షాస్వరూపము నుపదేశించెదను వినవలసినది. పరదీక్ష యన నెట్టిదనిన, చతుర్వేదోక్తమంత్రములచేతను, ఏకాయనోక్త మంత్రములచేతను, మంత్రసిద్ధాంతవిధిచే, పారంపరికదీక్షితుడును, వృద్ధుడును, ఆచార్యరూపుడును అగు నాచేత నెవడు దీక్షితు డగునో అట్టివానిచే నియ్యబడిన దీక్షయే పరదీక్ష యనబడును. ఇట్టి సబీజ స్వరూప మగు పరదీక్షను పొందియే దేవాలయములయందు భగవ దారాధనము చేయవలయును.

శ్లో॥ తాపః పుండ్ర స్తథా నామ మంత్రో యాగశ్చ పంచమః
ఏవం సామాన్యదీక్షాం తు దీక్షయిత్వా యథాక్రమం
వైష్ణవానాం హి సర్వేషాం యోగ్యా సా గృహపూజనే
యేషాం స్థూలేతి విజ్ఞేయా శాస్త్రేషు పరికీర్తితా.

తా॥ ఓలక్ష్మీ! అట్టి దీక్షలలో ద్విజదీక్షాస్వరూపమగు పంచ సంస్కారదీక్ష వైష్ణవులు మొదలగు సర్వవర్ణములవారికిని గృహ తిరువారాధనాధికార యోగ్యమైన సామాన్యస్వరూప స్థూలదీక్ష యన బడుచున్నది.

శ్లో॥ దీక్షాం సమాప్యావభృథం కారయేచ్చ యథాక్రమం
శిష్యో గురుం ధనై ర్గాభి ర్భూమిభి ర్భూషణాదిభిః
తర్పయిత్వా నమస్కృత్య తత స్తేనదనుజ్ఞయా
వేదఘోషై ర్వాద్యఘోషైః బంధుభి శ్చైవసైరపి
స్వేషాం గృహాణి సంహృష్టా గచ్ఛేయు ర్జలజోద్భవే
పరార్థయజనే దీక్షా మాచార్యపదపూర్వకాం
శృణుష్వావహితా దేవి! రహస్యం శాస్త్రచోదితం
మద్గోత్రిణ స్తపశ్చర్యా స్తేషాం యే శిష్యతాం గతాః
తేషు శాస్త్రార్థతత్త్వజ్ఞా వేదవేదాంగపారగాః
నీరోగా మధ్యవయసః తేషా మాచార్యపూర్వకం
అభిషేకం పురా కుర్యా త్తే మేవాలయపూజనే
అన్యేషాం దీక్షాకరణే కారయే న్నేతరా గురూన్
అథాచార్యాభిషేకాయ శిష్యం మద్గోత్రసంభవం
పరంపరాదీక్షితస్య కులే జాత మరోగిణం
ఆరోప్య యానం ఛత్రైశ్చ చామరై ర్వ్యజనాదిభిః
వేదఘోషై ర్వాద్యఘోషై ర్దీక్షితై ర్యతిభి స్తథా.

తా॥ ఓ లక్ష్మీ! యీపైన చెప్పిన సామాన్యస్వరూప పంచ సంస్కార స్థూలదీక్షను పొంది అనంతర మవభృథస్నానాదికృత్యము లను యథావిధిగా జరుపుకొని, ఆచార్యులను బహూకరించి బంధువర్గ ముతోసహా స్వగృహమునకు సంతుష్టహృదయులై చేరవలసినది. తరువాత పరార్థదీక్షను పొందవలసిన దెట్లనగా- వేదవేదాంగపారగు లును, సర్వలక్షణోపేతులును, మద్గోత్రసంభవులై పరంపరాదీక్షితు లైన ఆచార్యులవారితో సహా, భగవదాలయములయందు ఆరాధ నాధికారసిద్ధికొఱకు సద్గుణసంపన్నుడైనటువంటిస్ని మద్గోత్రసంభవు

డైనటువంటియు పరంపరాదీక్షాధికారమైనటువంటి శిష్యుడు దీక్షా విధియందు చెప్పబడిన యభిషేకాదిపూర్వక పరదీక్షను పొంది, ఆలయములయందు కర్షణాదిప్రతిష్ఠాంతభగవదారాధనమును చేయవలయును. ఇట్టిపరదీక్షను పరంపరాధికారులగు నాగోత్రజులకు తప్ప ఇతరులకు ఇవ్వకూడదు—అని భగవానులు శ్రీమహాలక్ష్మీ దేవికి నుపదేశించినారని, వింధ్యారణ్యనివాసులగు మహాఋషులకు బ్రహ్మపుత్రుడగు ఏకతమహాఋషి ఉపదేశించెను.

---

శ్రీప్రశ్నసంహితాయాం చతుఃపంచదశోధ్యాయః.

ఏకతః—

శ్లో॥ భగవంతం సమారాధ్య స్వేష్టం ప్రాప్యథ మా చిరమ్
స్వార్థే పరార్థే యజనే యూయం ముఖ్యాధికారిణః
యుష్మద్వంశ్యాశ్చ యే విప్రాస్తేఽభిషించ్యా యథావిధి
తేఽపి స్వార్థే పరార్థే చ భవేయు రధికారిణః.

తా॥ ఓ ఋషులారా, పెరుమాళ్ళను భగవచ్ఛాస్త్రోక్తరీతిచే పూజించి యిష్టార్థములను పొందుడు. స్వార్థయజనమునకును, పరార్థయజనమునకును, మీ కధికారము కలదు. మీవంశ్యులకును నీ యధికారము కలదు. ఎందువల్ల ననగా మీరు భగవద్గోత్రజులు. కనుక నధికారులు - అని ఏకతమహాఋషి చెప్పెను.

వేదశిరాః :—

శ్లో॥ కిం స్వార్థం చ పరార్థం కిం వదస్వ వదతాంవర.

తా॥ ఆప్రకారము ఏకతుడు చెప్పగా విని ఆ మహాఋషులలో వేదశిరుడనే మహాఋషి ప్రశ్నించిన దేమనగా స్వామీ! స్వార్థయజన మనగా నెటువంటిదో పరార్థయజన మనగా నెట్టిదో ఆజ్ఞ నియ్య వేడుచున్నానని పలికెను.

ఏకతః :—

శ్లో॥ సింధుతీరే సరిత్కూలే గ్రామే వా విపినాదికే
పత్తనే వా పర్వతాగ్రే స్వయంవ్యక్తాదిభేదతః

జగతాం క్షేమలాభాయ దుష్కృతాం నిధనాయచ
సంస్థితో వాసుదేవ స్తు పరార్థ ఇతి కథ్యతే
ఉత్కృష్టః పరశబ్దోఽయ మర్థో మోక్షాదిలక్షణః
యస్మా త్స లభ్యతే సోఽయం పరార్థః పరికీర్తితః
సఏవ సర్వఫలదః సర్వేషాం ముక్తిదాయకః
తస్మా త్సర్వజనై స్సేవ్యః పరార్థః పురుషోత్తమః
బ్రాహ్మణైః క్షత్రియైర్వైశ్యై శ్శూద్రాద్యై స్స్వస్వసద్మని!
స్థాపితో దేవదేవ స్తు స్వార్థ ఇత్యభిధీయతే
పశ్వారామగృహక్షేత్రపుత్రార్థాః స్వార్థసంపదః
తన్మాత్రదానా త్తద్దేవ స్వార్థ స్సంపరికీర్తితః
పరార్థ స్సూర్యసదృశ స్స్వార్థ స్తు గృహదీపవత్.

**తా॥** ఓ మహాఋషులారా! సముద్రతీరమందుగాని, నదియొక్క యొడ్డునగాని, గ్రామమందుగాని, అడవియందుగాని, పర్వతాగ్రమందుగాని, స్వయంవ్యక్తముగానో, ఋష్యాదులచే ప్రతిష్ఠింపబడియో, ప్రపంచముయొక్క క్షేమమునకొఱకును, దుర్మార్గులయొక్క నాశముకొఱకును, వేంచేసియుండు వాసుదేవమూర్తి పరార్థుడని చెప్పబడును (పరమనగా గొప్పదని యర్థము. అర్థమనగా - మోక్షాది పురుషార్థరూపము). దేనివలన నీ పరసంపదము పొందబడునో దానికే పరార్థయజన మందురు. కావున పరార్థుడైన భగవంతుడు సర్వజనసేవ్యుడు. బ్రాహ్మణాదివంశజులచే తమతమ యిండ్లయందు పెరుమాళ్లను వేంచేయుటచేసికొని ఆరాధించుటకు స్వార్థమని పేరు. పశ్వారామాదులవలె నిది స్వోపయోగిమాత్రమె. పరార్థయజనము సూర్యునివలె సర్వజనోపయోగి. ఇంటిలోనుండు దీపమువలె స్వోపయోగమునకు మాత్రమె స్వార్థయజనము.

అని యీ ప్రకారముగా వసిష్ఠమహాఋషి ఆ వింధ్యాటవీ నివాసులైన మహాఋషుల కందరికి ఉపదేశించెను.

**మఱియు :—**

శ్లో॥ దీక్షితై రితరై ర్విప్రైః కృతం యది పరార్చనం
మోహేన రాజరాష్ట్రాణాం మహా దోషో భవిష్యతి.

**తా॥** ఓ మహాఋషులారా! భగవద్వంశజులును, భగవద్గోత్రజులును పరంపరాదీక్షాధికారులును గాక యితర బ్రాహ్మణాది జాతులవారు మోహముతో కూడినవారలై పరార్థయజనాది దీక్షను పొందినట్లయితే అట్టివార లుండు రాష్ట్రము, రాజు వారలు మహాదోషములను పొంది రౌరవాదినరకవాసు లౌదురని భగవానులు లక్ష్మీదేవికి ఉపదేశించినారని బ్రహ్మపుత్రుడగు ఏకతమహాఋషి తాను లక్ష్మీదేవివలన నుపదేశింపబడిన యీ భగవదారాధనాది రూపమైన శ్రీ పాంచరాత్రశాస్త్ర బ్రహ్మవిద్యారహస్యమును మహాఋషు లందరికి నుపదేశించి అంతట నందరును కలిసి భగవంతుని స్మరించుచు వారివారినివాసములకు వెళ్ళి సుఖముగా నా శ్రీమన్నారాయణుని ఆరాధించుకొనుచునుండిరి.

---

## పాంచరాత్రాచార్యోత్పత్తివిషయము:

ఆస్తికపాఠకమహాశయులారా!

శాస్త్రిగారి మతత్రయాధికారసందేహమునుగూర్చి విశిష్టాద్వైత మతమునందు శ్రీవైష్ణవమతమునకు పాంచరాత్రమే మూలమనియును, పాంచరాత్రాదివైష్ణవు లందరును సర్వసమానస పూజ్యులే యని 14 వ ప్రకరణమందు చెప్పియుంటిమి. శాస్త్రిగారిసందేహనివృత్తిగా విశిష్టాద్వైత సిద్ధాంతమునం దధికారాదిభేదములచే పాంచరాత్రాచార్యులే ఆధిక్యముగలవారని, బ్రహ్మఋషిసాంప్రదాయికులైన పూర్వ బ్రాహ్మణులేయని స్వరూపసిద్ధాంత సాంప్రదాయిక సదాచారసద్ధర్మములచే తెలియజేయుచున్నాను.

శ్రీపాంచరాత్రాచార్యు లనగా నెటువంటివారలో వారియొక్క యుత్పత్త్యాదిలక్షణము లెట్టివో, వా రెట్టి యధికారలక్షణములుగల వారలో పూర్వపక్షులగు శాస్త్రిగారికి విశిష్టాద్వైతసిద్ధాంతసదాచార సద్ధర్మములచే తెలియజేయుచున్నాను.

అయ్యా!

శ్రీ పాంచరాత్ర మనునది, భగవదారాధన స్వరూప బ్రహ్మవిద్యయగు ఏకాయనవేదమైయున్నది.

అట్టి వేదము (వేదమేకాయనన్నామ, వేదానాం శిరసి స్థితః) అను ప్రమాణానుసారము ఏకాయనమను పేరుగలిగి వేదములకు శిరస్సైన యున్నది. ఆ ఏకాయన వేదమే మోక్షఫలప్రద యజ్ఞరూప బ్రహ్మవిద్య యగు శ్రీ పాంచరాత్రాగమ భగవచ్ఛాస్త్రము. దీనినే సాత్వతతంత్రమనియు, ఆగమమనియు, ఏకాయనమనియు, మూలవేదమనియు, సార్థకనామములతో వాడుచున్నారు.

ఇట్టి బ్రహ్మవిద్యా ప్రాప్తి భగవదారాధనస్వరూపమగు ఏకాయన మూలవేదము, (అనాదిర్వైష్ణవో విష్ణుః) అను ప్రమాణ ప్రకారము అనాదివైష్ణవ స్వరూపు శ్రీమహావిష్ణువగు శ్రీమన్నారాయణునిచే చెప్పబడినది ఇట్టి ప్రమాణములు (శ్లో॥ పాంచరాత్రం మహద్దివ్యం శాస్త్రం ప్రవిభాగశః । విశేషేణాధిగన్తవ్యం గీతం భగవతా స్వయం) అను బహువిధ ప్రమాణ్యానుసారము శ్రీమన్నారాయణునిచే ఉత్పత్తిచేయబడి మోక్షఫలప్రద బ్రహ్మవిద్యా రూప ఏకాయన వేదముగా నీ పాంచరాత్ర దివ్యాగమము మెప్పు చున్నది.

కనుక నీ భగవదారాధన రూపమగు ఏకాయన వేదము శ్రీమన్నారాయణునిచే శ్రీమహాలక్ష్మికి ఉపదేశించబడినది. కాబట్టి శ్రీపాంచరాత్రాగమశాస్త్రప్రవర్తకులైన పాంచరాత్రాచార్యులు శ్రీమన్నారాయణులే యని సుస్పష్టము.

ఇట్టి బ్రహ్మవిద్యాప్రాప్త వేదానుష్ఠానప్రవర్తకులు, భగవద్రూపమద్భాగావిర్భావస్వరూపులైన శ్రీపాంచరాత్రాచార్యులని తెలియవలెను.

మఱియు నీ వేదానుష్ఠాన ప్రవర్తకులందరును పాంచరాత్రులే యనియు, శ్రీవైష్ణవులే యనియు, వీరందరును సర్వసమాన పూజ్యత కలవారనియు సందేహ ముండవచ్చును. అట్టి సందేహనివృత్తికొఱకు నీ సర్వవైష్ణవసముదాయముకంటె శ్రీ పాంచరాత్రాచార్యులే గొప్ప వారలని శాస్త్రిగారికి బహుప్రమాణాదిరూపములతో తెలియజేయు చున్నాను.

ఏమనగా, సృష్ట్యాదియందు సర్వజగజ్జాలములలో నున్నటువంటి జీవకోట్లు యావన్మందియు తన్ను సేవించి కడతేరుటకుగాను, శ్రీమన్నారాయణుడు తన స్వరూపమును ఆరు భాగములుగా—అనగా(పర, వ్యూహ, విభవ, అంతర్యామి, అర్చా, ఆచార్య) విభజించి అర్చా ఆచార్య రూపములవరకు ఉన్న తన అయిదురూపములను ఆరాధించుటకుగాను, ఆరవరూపమగు, పాంచరాత్ర స్వయమాచార్యరూపుడై అర్చించుచు అట్టి భగవదారాధనరూప బ్రహ్మవిద్యయగు ఏకాయన వేదమందు స్వార్థ పరార్థయజనాధికార దీక్షాభేదములు కల్పించి, అట్టి దీక్షా భేదములతో నున్న వేదమును అధ్యయనముచేసి ప్రవర్తించ గలందులకు తన యంశసంభూతులుగా భారద్వాజ, వశిష్ఠ, విశ్వామిత్ర, కౌండిన్య, వేదశిరో, భార్గవ, మరీచి, కశ్యప, కవషులను సృజించి, వారలను తన గోత్రజులుగా నేర్పఱచి, వారికి, సబీజ, నిర్బీజరూప స్వార్థ పరార్థ ఉభయదీక్షలను పొందింపజేసి, యీ భగవదారాధనరూపమగు వేదమును అధ్యయనము చేయించి, వారిని తన వంశపరంపరా దీక్షాప్రవర్తకులుగా చేసిరి.

అట్టి దీక్షా స్వరూప మోక్షవిద్యయగు నీ పాంచరాత్రాగమ ఏకాయన మూలవేదమును ఈఋషుల గోత్రప్రవర్తక వంశోద్భవులే పరంపరాదీక్షితులై అనుష్ఠించుచు సర్వపూజ్యాధికారులై పాంచరాత్రులుగా భగవద్వంశపరంపరయందు జన్మించుచు భగవదనుష్ఠానారాధనాదికైంకర్యోజ్జీవనులుగా యుగములతోబాటు ప్రవర్తించుచున్నారు. ఇట్లుండగా,

ఈలోకమందు భగవద్ధర్మోపదేశకర్తలు లేక అప్పుడప్పుడు క్షీణించుచుండగా చూచి భగవంతుడు తన యంశసంభూతులనుగా ఆళ్వారాచార్యులను అవతరింపజేసి, యీ భగవద్ధర్మమును ప్రతిష్ఠింపించి, యీలోకమందుండు ప్రాణికోట్లకు అనుష్ఠింపించగలందులకు ఉపదేశకర్తలనుగా నిర్ణయించిపంపగా, అప్పుడు భగవానులయాజ్ఞ ప్రకారము నమ్మాళ్వారులు మొదలుగాగల పూర్వాచార్యులు లోకమునందు ఈ భగవద్ధర్మమును ప్రతిష్ఠించి, ప్రకాశింపజేసి, కాపాడి,

ముందు రామానుజులవా రవతరించి యీ ధర్మమును ఎక్కువగా ప్రకాశింపజేయుదురని తమశిష్యులకు ఉడయవరుల విగ్రహమును ఒకదాని నిచ్చి దీనిని పూజించుకొనుచు, మీరు వారి రాక కొఱ కెదురుచూచుచుండవలసిన దని తమ శిష్యుల కందరకు ఆజ్ఞ సాయించి తిరిగి వైకుంఠమునకు వేంచేసి యాభగవత్సన్నిధిని ముక్త పురుషులై ప్రకాశించుచుండిరి.

ఇట్లుండగా కొన్ని దినములకు రామానుజులవారు భగవానుల ఆజ్ఞప్రకార మవతరించి, భూలోకములో క్షీణదశను పొందుచున్న యీభగవద్ధర్మమగు శ్రీపాంచరాత్రాగమ బ్రహ్మవిద్యాస్వరూప ఏకాయనవేదమును పాంచరాత్రాచార్యులవారిచే తా నుపదేశమును పొంది, అధ్యయనాధ్యాపనాధికారులుగా తా ననుష్ఠించుచు అనంతరము, పాశుపత, శైవ, బౌద్ధ, పాషండాదిదుర్మతాచారములతో నిండియున్న ప్రాణికోట్లకు విష్ణువే పరతత్త్వమని చెప్పబడు నీ భగవద్ధర్మము నుపదేశించి, అందరిని విష్ణుభక్తులగు వైష్ణవులనుగా చేసి, వారికి నీపాంచరాత్రాగమ భగవదారాధన రూపమగు స్వార్థయజనాధికారదీక్ష, అనగా గృహతిరువారాధనోపయోగ్యత గల పంచసంస్కారదీక్షనుమాత్రము పొందింపజేసి, వీరిలో - ఏకాంగులనుగాను, సన్యాసులనుగాను, జియ్యంగార్లనుగాను, పీఠస్థులనుగాను, ఏర్పఱచి వీరలు భూలోకమందు గల ప్రాణికోట్లకు ఈ భగవద్ధర్మము నుపదేశరూపముగా అనుష్ఠింపజేసి, అట్టి ప్రాణులను శిష్యులనుగా గ్రహించి, యీ శిష్యులకు మోక్షఫలప్రదరూపమగు స్వార్థదీక్షనుమాత్ర మిచ్చి వారలను కడతేర్చుచు, తామునుస్వార్థదీక్షామాత్రాధికారులై శిష్యార్జనులై యీభగవద్ధర్మమును అనుష్ఠించి అనుభవించుచు, చరమోపాయ ప్రపత్తినిష్ఠాస్వరూప ఏకాంతులగు మహాభాగవతోత్తములుగా ప్రవర్తించుచుండవలసిన దని ఉడయవరులచే నాజ్ఞాపించబడినవారలై ఆచార్యదీక్షాధికారరహితులై పరార్థయజనాధికారకర్మహీనులై దివ్యదేశములయందు ఆచార్యసాధకులుగా- అనగా పరిచారకాదికైంకర్యములను చేయుచు, భగవద్రూపార్చకులగు ఉభయదీక్షాధికారో

భయవేదాంతప్రవర్తక శ్రీపాంచరాత్రభట్టాచార్యులవారిచే నీయబడిన తీర్థప్రసాదాదులను స్వీకరించుచు, ముక్తపురుషులతో బాటుగా ఉంటున్న వీరికి ఆచార్యు లను శబ్దము లేకుండ భాగవతు లనియు, భట్టరు లనియు, గురువుచే సంస్కరించబడిన పంచసంస్కారవిధియందు నామనిర్దేశము చేయబడుచున్నది.

కనుక లోకములో గల ప్రాణికోట్ల కుపదేశముల నిచ్చుచు వారివలన తమదారపుత్రాదులను పోషించుకొనుచు గురువులవా రని పిలువబడినంతమాత్రమున ఉభయదీక్షాధికారులై భగవదనుష్ఠానారాధనాదికై లోకోజ్జీవనులై ఉభయవేదాంతాధికారులగు శ్రీ పాంచరాత్రభగవద్రూపాచార్యులవారికన్న వీర లేల యెక్కువయో, వీరికన్న పాంచరాత్రాచార్యు లెందువలన నెక్కువవారు కారో, ఎందువలన వీరికిని, వారికిని గల అధికారాదిభేదములవలన నెవరు అధికార్యాధికారులో శాస్త్రిగారే యీ ధర్మశాస్త్రప్రమాణములవలన విచారించి తమ సందేహనివృత్తి చేసికొనెదరుగాక—

ఇకను శ్రీపాంచరాత్రాచార్యు లనగా నెటువంటివారో తెలియజేయుచున్నాను.

శ్రీ పాంచరాత్రాచార్యు లనగా భగవద్రూపులై - భగవద్వంశజులై, భగవద్గోత్రజఋషివంశోద్భవులై, వంశపరంపరోభయదీక్షాధికారు లనగా, స్వార్థ-పరార్థదీక్షలు. స్వార్థదీక్ష యనగా పంచసంస్కారములతో గూడి గృహాతిరువారాధనాధికార యోగ్యతయు, పరార్థదీక్ష యనగా పట్టణములయందు, గ్రామములయందు, పర్వతాగ్రములయందు, నదీతీరములయందు, వింధ్యాటవి మొదలగు పుణ్యక్షేత్రములయందు స్వయంవ్యక్తాదిభేదములతో నుండు భగవద్వైభవరూపములను శ్రీ పాంచరాత్రాగమభగవద్ధర్మశాస్త్రమునందు చెప్పబడిన విధప్రకారము ఆలయబింబనిర్మాణకర్షణాది ప్రతిష్ఠాంత కర్మకాండోక్త భగవదారాధనాధికారాచార్యావరణాది యోగ్యతాధికారతయుగలయుభయదీక్షాధికారులై, అధ్యయనాధ్యాపనాదిస్వయమాచార్యాధికారులై, బ్రహ్మవిద్యయగుపకాయున వేదశాఖా మంత్రమంత్రార్థానుష్ఠాన ప్రవర్తకులై, విశిష్టాద్వైతసిద్ధాంత మతో

ద్ధారకులగు రామానుజాచార్యాదిముక్తపురుషులకన్న పూర్వికులై, వేదవేదాంగ పారగులై, వేదాంతార్థ ప్రవీణులై, భగవచ్ఛాస్త్ర నిష్ఠాగరిష్ఠులై, భగవద్వంశ క్రమముగా దీక్షితులైన వారివంశమందు జన్మించుచున్నవారలై, పాంచకాలిక కర్మానుష్ఠాతలై, పాతంజల శాస్త్రాదియోగనిపుణులై కల్పనాది ప్రతిష్ఠాంత కర్మకాండము నితరుల సాహాయ్యము లేకయే నిర్వహించువారలై, ఆస్తికులై, జితేంద్రియులై, మానసారాధనము చేయుటయందు దక్షులై, గర్భదీక్షాపరులై, మంత్రశాస్త్రజ్ఞులై, మంత్రసిద్ధిగలవారలై, త్రిపాద్విభూతి స్వరూపమగు భగవత్సన్నిధానము లయందే నిత్యనివాసులై, భగవదారాధనాది పూజాదక్షులై, సర్వపరిచారకాది భాగవతోత్తములచే పూజించబడుచున్నవారలై, నిత్యసూరులతో బాటు భగవదనుష్ఠానానుభవజనితమహానందమగ్నులై, ఉభయ వేదాంతప్రవర్తకులై, శాంతశమదమాద్యనంత కళ్యాణగుణపరిపూర్ణులై, భగవత్కైంకర్యోజ్జీవనులై, భగవదాజ్ఞాప్రవర్తకులై, భగవద్ధ్యానపరులై, ప్రకాశించుచుండురు. వీరలీపైన చెప్పిన భాగవతోత్తములగు సర్వవైష్ణవుల సముదాయముతో కలియకుండ ప్రత్యేక తెగగానే పాంచరాత్రు లని వ్యవహరించబడుచున్నారు.

కాబట్టి శాస్త్రిగారు - ఈ సర్వవైష్ణవ సముదాయమునకన్న - శ్రీపాంచరాత్రులే సర్వవిధలకు నాధారాధిక్యములుగలవారలనియు, శ్రీమహావిష్ణుస్వరూపు లనియు, ఈ సర్వవైష్ణవులు తద్దాసు లనియు తెలియగల ప్రమాణమును ప్రదర్శించి విరమించెదను.

శ్లో॥ అనాదివైష్ణవో విష్ణు రాది శ్రీపాంచరాత్రికః,
తద్దాసా వైష్ణవా స్సర్వే పంచసంస్కారపారగాః.

అనగా, అనాదివైష్ణవుడు శ్రీమహావిష్ణు వనియు, ఆదివైష్ణవుడు శ్రీపాంచరాత్రాచార్యు లనియు, పంచసంస్కార దీక్షామాత్రపరులగు ఈ సర్వవైష్ణవులును తద్దాసు లనియు తెలియజేయుచున్నది. మఱియు,

శ్లో॥ వేద ఏకాయననామ్నా మ వేదానాం శిరసి స్థితః,
తదర్థకం పాంచరాత్రం మోక్షదం తత్క్రియావతాం

యస్మి న్నేకో మోక్షమార్గో వేదః ప్రోక్త స్సనాతనః
మదారాధనరూపేణ తస్మా దేకాయనం భవేత్.

అను శ్రీప్రశ్నసంహితాప్రమాణానుసారము భగవదారాధనాత్పరమైనదే ఏకాయనవేద మనియు అట్టి ఏకాయన శాఖాప్రవర్తకులైనవారలే శ్రీపాంచరాత్రస్వాములనియు, తక్కినవారలు దశవిధ శ్రీవైష్ణవులుగా తెలియుదగియున్నది. మఱియు,

శ్లో॥ వేదవేదాంగతత్త్వజ్ఞో వేదాంతపరినిష్ఠితః
మీమాంసాన్యాయనిపుణో ధర్మశాస్త్రవిశారదః
ఇతిహాసపురాణజ్ఞః పాంచరాత్రార్థతత్త్వవిత్
పరం భగవదైకాంత్యం జ్ఞాత్వా ధర్మం సమాచరేత్.

—భారద్వాజసంహితాయాం.

వ్యాఖ్యా—వేదవేదాంత మీమాంసాన్యాయధర్మస్మృతీతిహాసపురాణపాంచరాత్రశాస్త్రంబుల వాస్తవస్థితి జక్కఁగ నెఱిఁగి యున్నట భగవదారాధనారాధ్య భగవత్స్వరూపంబులే నిరూపితంబు లని నిర్ణయించుకొనియే ధర్మంబుల నాచరించవలయు నని యున్నందున బహువిధ ధర్మశాస్త్ర ప్రమాణంబులచే నొప్పుచున్న ఏకాయన వేదశాఖా ప్రవర్తక భగవత్స్వరూపులగు శ్రీపాంచరాత్రులే అనేకారాదిభేదములచేత నాధిక్యము గలవారనియు, విశిష్టాద్వైతసిద్ధాంతపరమైన ప్రథమ పూజ్యాధికారు లనియు శాస్త్రిగారు మతాంతరు లగుటవలన విశిష్టాద్వైత సిద్ధాంత సదాచార సద్ధర్మంబులచే పాంచరాత్రాచార్యాధిక్యమును స్పష్టముగా తెలియబఱచుటయైనది.

ఇట్లు,
శ్రీమాన్, శ్రీపతి సుదర్శన భట్టాచార్యులు,
బేతవోలు,
గుడివాడపోస్టు, కృష్ణాజిల్లా.

| నెంబరు | పేరు గ్రామము | రు. | అ. | పై. |
|---|---|---|---|---|
| 1 | దిట్టకవి తిరుమలాచార్యులుగారు, అంగలూరు | 10 | 0 | 0 |
| 2 | చలమచర్ల శోభనాద్రాచార్యులుగారు, పుంగుటూరు | 5 | 6 | 0 |
| 3 | చలమచర్ల కృష్ణమాచార్యులుగారు, చాటపల్లి | 1 | 0 | 0 |
| 4 | దిట్టకవి శోభనాద్రాచార్యులుగారు, వానపాముల, గుడివాడపోష్టు | 5 | 6 | 0 |
| 5 | కోనూరు బుచ్చమాచార్యులుగారు, కినుమూరు, ఉయ్యూరుపోష్టు | 1 | 0 | 0 |
| 6 | కోనూరి గోపాలాచార్యులుగారు, యలమర్రు, యలమర్రుపోష్టు | 1 | 0 | 0 |
| 7 | దిట్టకవి తిరుమలాచార్యులుగారు. యలమర్రు, యలమర్రుపోష్టు | 2 | 0 | 0 |
| 8 | దిట్టకవి రామానుజాచార్యులుగారు, పూడివాడ, రేపల్లెతాలూకా, కూచిన్నపూడిపోష్టు | 2 | 0 | 0 |
| 9 | దిట్టకవి వెంకటాచార్యులుగారు, పెద్దవరం, కనగాలపోష్టు | 1 | 0 | 0 |
| 10 | దిట్టకవి శేషగిర్యాచార్యులుగారు, పెద్దవరం | 2 | 0 | 0 |
| 11 | దిట్టకవి చినతిరుమలాచార్యులుగారు, పెద్దవలిపాడు, కొల్లూరుపోష్టు | 1 | 0 | 0 |
| 12 | దిట్టకవి తిరువెంగళాచార్యులుగారు, పెద్దవరం అగ్రహారము | 1 | 0 | 0 |
| 13 | దిట్టకవి వెంకట రామానుజాచార్యులుగారు, సంతరావూరు | 5 | 6 | 0 |
| 14 | పాలూరి వెంకట శేషాచార్యులుగారు, పూసపాడు, పర్చూరుపోష్టు | 10 | 0 | 0 |
| 15 | భాగవతుల నరసింహాచార్యులుగారి కుమారుడు గోపాల కృష్ణమాచార్యులుగారు, ఉలవపాడుపోష్టు, నెల్లూరుజిల్లా | 10 | 0 | 0 |
| 16 | కొండపూడి లక్ష్మణాచార్యులుగారు, పుల్లపాలెం, పుల్లపాలెంపోష్టు, నెల్లూరు డిస్ట్రిక్టు | 5 | 6 | 0 |
| 17 | ఏటూరి శ్రీనివాసాచార్యులుగారు, నెల్లూరు, నెల్లూరుపోష్టు | 2 | 0 | 0 |
| 18 | భాగవతుల సుదర్శనాచార్యులుగారు, అద్దంకి (పోష్టు) | 1 | 0 | 0 |
| 19 | భాగవతుల శేషాచార్యులుగారు, వలపర్ల, వలపర్లపోష్టు | 1 | 0 | 0 |
| 20 | దిట్టకవి వెంగళాచార్యులుగారు, యిసుకదర్శి, వలపర్లపోష్టు | 1 | 0 | 0 |
| 21 | దిట్టకవి శోభనాద్రాచార్యులుగారు, నాగరాజుపల్లె మార్టూరుపోష్టు | 1 | 0 | 0 |
| 22 | ధనకుధరం రామానుజాచార్యులుగారు, ఆలపాడు గ్రామం, అమృతలూరుపోష్టు | 1 | 0 | 0 |
| 23 | నంద్యాల శేషాచార్యులుగారు, గుంటూరు అగ్రహారము | 5 | 6 | 0 |
| 24 | కొడవటికంటి వెంకట సీతారామానుజాచార్యులుగారు. ముక్కామల, తాడికొండపోష్టు | 1 | 0 | 0 |
| 25 | దిట్టకవి కేశవాచార్యులుగారు, అనంతవరం, తాడికొండపోష్టు | 1 | 0 | 0 |
| 26 | దిట్టకవి రామానుజాచార్యులుగారు, నెక్కల్లు, తాడికొండపోష్టు | 1 | 0 | 0 |
| 27 | దిట్టకవి వీరరాఘవాచార్యులుగారు, కంతేరు, గుంటూరుపోష్టు | 1 | 0 | 0 |
| | మొత్తం | 79 | 14 | 0 |